సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 49
సంచిక 19
11.1-56

మన్మథ మార్గశిర బహుళ చతుర్దశి బుధవారం

# సమస్తాంధ్ర మహాజనులకు సంక్రాంతి కానుక

రాబోయే సంచిక సంక్రాంతి సంచికగా వెలువడుతోంది.

ఎక్కువ పేజీలతో - కొత్త అందాలతో - కొత్త ఆకర్షణలతో

- ★ పోటీలో గెలుపొందిన రెండు కథలు
- ★ చక్కని వ్యాసాలు
- ★ ఆహ్లాదకరమైన కథలు
- ★ ముచ్చటైన చిత్రాలు, ఫొటోలు.

వెల పావలా మాత్రమే

మీ ప్రతి నేడే రిజర్వు చేసుకోండి.

# న్యూఢిల్లీ లేఖ

**శ్రీ కృష్ణ**

(ఆంధ్రపత్రిక న్యూఢిల్లీ ప్రతినిధి)

లోక్ సభలోను, రాజ్యసభలోను, ఈ వారంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘంని వేదికపై బ్రహ్మాండమయినచర్చ జరిగింది. దీనితో ఈచర్చలో ప్రథమఘట్టం ముగిసిపోయింది.

ఈ చర్చల్లో సుమారు 8 వందలమంది సభ్యులు పాల్గొన్నారు.

ఒకసారి సింహావలోకనం చేస్తే—ఈ చర్చల్లో ప్రాంతీయ దురభిమానాలు, నాయకత్వంకోసం పాకులాటలుమాత్రమే ప్రత్యక్షమాతాయి. ఈ కుగ్రామం ఈరాష్ట్రంలో ఉండాలా? కూడదా? అన్నదే ప్రముఖ సమస్య అయి కూచుంది. అంతే జాతీయైక్య భావం సంగతి ఎవరికీ పట్టినట్టు కనిపించలేదు. ఈ పునర్వ్యవస్థీకరణవల్ల బయలుదేరే ఆర్థిక సమస్యలుగాని, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వోద్యోగాల పరస్పర సమన్వయ సమస్యగాని ఎవరికీ పట్టలేదు. ప్రధాన మంత్రి ఈ విషయంలో చాలా ఆందోళనపడినట్లు కనబడుతుంది. కనకనే మరి గత్యంతరంలేక రాష్ట్రీయ దురభిమానాల ఉద్ధృతం అణిచివెయ్యడానికి ప్రత్యేకంగా ప్రాంతీయ సంఘాలేర్పాటు చెయ్యాలని సూచించారు. దీనికి అందరు ఆమోదించారు. ప్రధాన మంత్రి తమ ప్రాంతీయ సంఘప్రణాళిక కొంత విస్తృతం చేసి ఈ సంఘాలకు కొంత బాధ్యత, పార్లమెంటులో తగినంత ప్రాతినిధ్యము కలిగించాలని ఆలోచిస్తున్నారు. ఈ విషయం చాలా ముఖ్యం. దీని అధికారాలు కూడా విస్తరించే అవకాశాలున్నాయి. రాజ్యాంగం కట్టడం ఏర్పాటుచేసినంత మాత్రాన ప్రయోజన మేమీలేదు. అవి పూర్తిగా అమలు పరచడం చాలా అవసరం. ఏదిఏమైనా చివరికి జాగ్రత్తగా గమనించవలసిందిరాజ్యాంగం అమలుజరపడమే. దీనికిప్పుడు గట్టి పరీక్షా సమయం వచ్చింది.

సిక్కు సంఘీయులను కొంత శాంత పరచాలనే లక్ష్యంతోనో, లేక కొంతపెద్ద ఉద్యోగం ఇవ్వాలనే అభిప్రాయంతోనో సర్దార్ నవాబ్ సింగ్‌ను కలకత్తా పోర్టు ట్రస్టుకు అధ్యక్షులుగా నియమించారు ఇంతకు పూర్వం ఈయన పంజాబు ప్రభుత్వానికి ప్రధాన కార్యదర్శిగా ఉండేవారు.

కేవులన్నీ కేంద్రప్రభుత్వానివే! పోర్టు ట్రస్టుఅధ్యక్షుడుకూడా కేంద్రప్రభుత్వోద్యోగే! కాని పశ్చిమబెంగాల్ ప్రభుత్వం కేంద్రానికీవిషయంలో వెంటనే తన అధిక్షేపణ తెలియజేసింది. సర్దార్ నవాబ్ సింగ్ బెంగాలీకాదనీ కనక ఈయన్ని పోర్ట్ ట్రస్ట్ అధ్యక్షుడుగా నియమించడానికి వీలు లేదనీ ఘోష పెట్టింది. పోర్ట్ ట్రస్ట్ అధ్యక్షుడు పదహారణాల బెంగాలీయేఅయి ఉండాలని పట్టుపట్టింది!

కేంద్రం ఈ జోహుకుముకు తలఒగ్గి సర్దార్ నవాబ్‌సింగ్‌ను కేంద్ర ప్రణాళికా సంఘంలో సభ్యులుగా నియమించింది. దీనితో పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం బాగా బిరబిగిసి, కలకత్తాలో ఉన్న ఇద్దరు రైల్వే జనరల్ మేనేజర్లు బెంగాలీలు కారనీ వీరిని కూడా బదిలీ చెయ్యాలనీ గట్టిగా పట్టుపట్టింది. కేంద్రం రాజ్యాంగరీత్యా సంక్రమించిన అధికారం ఉపయోగించక పోతే - ఈ ప్రాంతీయ సంఘాలేర్పాటు చేస్తే మాత్రం ప్రయోజనం ఏమిటి? వీటి వల్ల భారత జాతీయైక్యభావం బలపడగలదనే నమ్మకం ఏమి ఉంది? భారతదేశీయశాఖ దస్త్రాలు పరిశీలిస్తే ఈవిషయంలో ఇంకా కొన్ని రహస్యాలుకు బయలుపడుతున్నాయి. పంజాబ్, పెప్సు హిమాచల్ ప్రదేశ్ వంటి ఎ.బి.సి. రాష్ట్రాల సామాన్య వ్యవహారాలలో కూడా సమన్వయం కుదరడం లేదని తేలుతుంది. దీనికి ఆయా రాష్ట్రాల వ్యతిరేకభావం కొంతవరకు కారణమని చెప్పవచ్చును. కేంద్రప్రభుత్వం గట్టిగా పూనుకోకపోవడంవల్ల ఇటువంటి పరిస్థితు లేర్పడుతున్నాయి. కేంద్రం ఇన్నాళ్ళనించీ ఏ తీరగలి రాష్ట్రాలు

## విషయానుక్రమణిక

ముఖ చిత్రం: "నర్తకి సంధ్య

కూడా సర్వస్వతంత్ర రాజ్యాలనే దృష్టితో వ్యవహరించింది ఇక ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వాలు తమ హస్తగతమైన అధికారాలు తేలికగా జారవిడిచివేస్తాయా? ఈ ప్రాంతీయ సంఘాల ఏర్పాటువల్ల రాష్ట్రాలు తమ అధికారాలు వదులుకోక తప్పదు

వెనక సూచించినట్లు పార్లమెంటువిషయంలో సంకుచిత సమస్యలు మాత్రమే చర్చించి భారత జాతీయైక్యానికి సంబంధించిన సమస్యలు చల్లగా జారవిడిచివేసింది భారతదేశంలో బయలుదేరే విచ్ఛేదకభావాలణిచివెయ్యడానికి కేంద్రానికి చాలా అధికారాలున్నాయి గత ఎనిమిది ఏళ్ళనుంచీ భారత జాతీయైక్యం దృఢపడడానికి కేంద్రం ఎన్నెన్నో ఏర్పాటులు చేసింది కాని ఈ అధికారా లుపయోగించక పోవడంవల్లనే ఈ సమస్య లేర్పడుతున్నాయి. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘానికి యీ సమస్య సమగ్రంగా చర్చించే అవకాశం కలిగింది. ఈ సంఘం ఈ విషయంలో ఇలాగ వ్రాసింది.

"తక్కువ సంఖ్యగలిగిన భాషలు మాటలాడేవారిలో ప్రభుత్వోద్యోగాల విషయంలో చాలా అసంతృప్తి ఏర్పడుతున్నది. రాష్ట్రాలలో స్థిరనివాసా లేర్పాటు చేసుకొన్న వారికే ఉద్యోగా లివ్వాలని చాలా రాష్ట్రాలు నిర్ణయించాయి అల్పసంఖ్యాకులు ఈ విషయంలో ఫిర్యాదులు చేస్తున్నారు. ఆయా రాష్ట్ర ప్రభుత్వాలీ విషయంలో చేసే నిబంధనలవల్ల అల్పసంఖ్యాకులకు బాగా అన్యాయం జరుగుతున్నదని తెలుస్తున్నది. 8 సంవత్సరాలు మొదలు 15 సంవత్సరాల దాకా ఒక రాష్ట్రంలో స్థిరంగా ఉంటేనేగాని ఉద్యోగార్హత కలగదు. ఇది రాజ్యాంగ చట్టం 16 వ సూత్రానికి విరుద్ధం పరిస్థితులు పునర్విమర్శ చేసేదాకా పాతఉద్యోగాలలో ఉన్న వారిని అల్లాగే ఉండనిస్తున్నారు

ప్రస్తుతం ఈ విషయంలో పునర్విమర్శ జరుగుతున్నట్లు తెలుస్తున్నది.

భారతపౌరుల మధ్య విచక్షణ చూపరాదనే రాజ్యాంగ నియామాన్ని రాష్ట్రప్రభుత్వాలు ఎంతవరకూ ఉల్లఘించవచ్చునో నిర్ణయించే చట్టాన్ని పార్లమెంటులో ప్రవేశపెట్టవచ్చునని తెలుస్తున్నది ఈ చట్టాన్ని త్వరలో ప్రవేశపెట్టడం అవసరం. ఒకవేళ అటువంటి ఉల్లంఘనను అనుమతించే పక్షంలో, సాధ్యమయినంత హానిరహితంగా ఉండేట్లు అనుమతించడం మంచిది.

కొన్ని రాష్ట్రాలు తమరాష్ట్రంలోని ప్రధానభాష బాగా వచ్చిఉంటేనే తప్ప ఉద్యోగా లివ్వమనడం ద్వారానూ, ఆ భాషలో పోటీపరీక్షలు పెట్టడంద్వారానూ



ఉద్యోగాలుచేసే మధ్యతరగతి స్త్రీలలో పెద్ద దక్షతలేనివారి పిల్లలకు ప్రొద్దుట నుండి సాయంత్రం వరకూ సంరక్షణ చేయడానికై ఆంధ్ర మహిళాసభ నెలకొల్పిన 'నాగేశ్వర శిశువిహార్' కు మధ్యప్రదేశ్ గవర్నరు డా॥ పట్టాభి సీతారామయ్య డిసెంబరు 28 వ శంకుస్థాపన చేశారు. ఈ చిత్రంలో డా॥ పట్టాభి, మద్రాసు మేయరు శ్రీ రామనాథ అయ్యర్, శ్రీమతి దుర్గాబాయ్ దేశ్ ముఖ్, శ్రీమతి కామాక్షమ్మగార లున్నారు.

# ★ న్యూఢిల్లీ లేఖ ★

బలీయంగా ఉన్న భాషావర్గానికే అన్ని ఉద్యోగాలూ లభించేట్లు చేస్తున్నాయనీ, ఈవిధంగా ఇతర భాషావర్గాలకు అన్యాయం జరుగుతోందనీ కొందరు అంటున్నారు. ప్రస్తుతం చాలా రాష్ట్రాలలో పెద్ద ఉద్యోగాలకు పోటీపరీక్షలు ఇంగ్లీషులోనే జరుగుతున్నాయి. కొన్ని రాష్ట్రాలలో ఒకటో రెండో ప్రాంతీయ భాషల్లోకూడా పరీక్షలు పెడితే పెడుతున్నారు. 'చాలా రాష్ట్రాలలో ప్రాంతీయ భాషలో కనీసం ఒక పరీక్షా పత్రమైనా విధిగా ఉండితీరుతున్నది. చిన్న పరీక్షలకు ప్రాంతీయ భాషల్లో ఏదో ఒకటి విధిగా వచ్చి ఉండాలని నియమం ఉంటున్నది. ఇతర భాషలకు చెందిన అభ్యర్థులకు ప్రాంతీయ భాష బాగా వచ్చిఉండాలనే నియమాన్ని చాలా రాష్ట్రాలు అమలులో పెడుతున్నాయి.

రాష్ట్రంలోని ప్రభుత్వోద్యోగులకు ఆ రాష్ట్రపు ప్రభుత్వభాష బాగా వచ్చి ఉండాలనేది నిజమే. అయితే వచ్చిన బాధల్లా ఏమిటంటే, ఒక భాషావర్గానికి చెందిన అభ్యర్థులు మనకి కావలసినవారూ, మిగతా భాషా వర్గాలకు చెందిన అభ్యర్థులు మనకు అక్కరలేనివారూ అనే మన స్తత్వం అవసరమా అని. ఇప్పుడు కొన్ని రాష్ట్రాలలో అమల్లోఉన్న ఆచారం చూస్తే ప్రధానమైన భాషా వర్గంవారికే అన్ని సౌకర్యాలూ కలుగుతున్నాయని తేలిపోతోంది. అందుచేత రాష్ట్ర ప్రభుత్వోద్యోగాలన బడేవి, రాష్ట్రంలోని ప్రధానభాష వచ్చిన వారికేకాక ఇంగ్లీషు హిందీభాషలుగాని, రాష్ట్రంలోని అల్పసంఖ్యాకులభాషలుగాని వచ్చినవారికి కూడా ఇచ్చేట్లు చూడడం మంచిది. అటువంటప్పుడు, ఉద్యోగానికి తీసుకున్న తరవాత ప్రొబేషన్ అయిపోయేలోగా రాష్ట్రప్రభుత్వభాషలో పరీక్ష పెట్టడం ఉత్తమం. చిన్న ఉద్యోగాలకు మాత్రం రాష్ట్రప్రభుత్వ భాషలోనే పరీక్షలు పెట్టవచ్చును.

ముఖ్యమైన ఉద్యోగాలకు వ్యక్తులను నియమించేటప్పుడు అధికారంలో ఉన్న పెద్దలుపరిపాలనా సామర్థ్యం నీతి,న్యాయం మొదలైన వాటి నన్నిటినీతోసి రాజనీ వ్యవహారించేపక్షంలో ప్రమోషన్లు, క్రమశిక్షణ ఇత్యాది విషయాల్లో చాలా అన్యాయాలు జరిగే అవకాశం ఉంది. అందుచేత రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమీషన్లలో సభ్యులను నియమించేటప్పుడు, ఆ సభ్యులు సంకుచితవాదులుగా ఉండకుండా చూడడం అత్యవసరం. రెండు మూడు రాష్ట్రాలకు ఒకే పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఏర్పాటుచేయడంవల్ల పైన చెప్పినది సాధ్యంకావచ్చును. ఇలా రెండు మూడు రాష్ట్రాలకు ఒకే కమీషన్ సభ్యులను నియమించేఅధికారం రాజ్యాంగ రీత్యా రాష్ట్రపతి కొక్కనికే ఉన్నది.

ఒక రాష్ట్రానికి సంబంధించిన కమీషన్లకుకూడా ఈ సూత్రాన్నే వర్తింపజెయ్యడం అవసరం. ఇందువల్ల ఈ కమీషన్ల గౌరవ ప్రతిపత్తులూ, స్వాతంత్ర్యమూ అధికమవుతాయికూడాను.

భారత ప్రభుత్వమూ, రాష్ట్రప్రభుత్వాలూకూడా ఈ విషయానికి అత్యంత ప్రాధాన్యం ఇవ్వవలసి ఉంటుంది.

దేశంలో కొత్తరాష్ట్రా లేర్పడగానే, రాష్ట్ర ప్రభుత్వోద్యోగాల పునర్వ్యవస్థీకరణం గూర్చి వెంటనే ఏర్పాట్లు చేయవలసి ఉంటుంది. ఏ ప్రాంతానికి చెందినవీ స్పష్టంగా తెలియని ఉద్యోగాల విషయంలో ఈ పునర్వ్యవస్థీకరణం ఏమంత కష్టం కాదు. అటువంటి చోట్లకూడా పరస్పరం చర్చించుకొని ఒక నిర్ణయానికి రావడం ఏమంత కష్టమయిన పనికాదు.

ఇక, సిబ్బంది కేటాయింపు వ్యవహారం. దీనికి, ఉద్యోగుల యిష్టాయిష్టాలు ప్రాతిపదికగా తీసుకోవడం మంచిది. అంటే దేశ ప్రయోజనాలకి భంగం కలుగకుండా ఉన్నంతవరకూ, ఈ పద్ధతి అవలంబించడం మంచిది. అటు ఉద్యోగులకూ, ఇటు కొత్త రాష్ట్రాలకూ కూడా సంతృప్తికరంగా ఏర్పాటు కావాలి.

తరగతివారీగా శాఖలు ఏర్పాటుచేసి, సిబ్బందిని కేటాయించినతరువాత, ఆమేరకు ఆయా తరగతుల ఉద్యోగాల నన్నిటినీ కలుపుకురావాలి. ఈ కార్యక్రమానికిముందే కొన్ని పద్ధతులు, సూత్రాలు నిర్ధారణగా ఏర్పాటు చేసుకోవడం అవసరం. దేశవ్యాప్తంగా అనుసరించడానికి వీలుగా వీటిని రూపొందించాలి.

ఈ లక్ష్యానికి అనుగుణంగా కనబడే సూత్రాలలో ఒకటి, ఉద్యోగుల సీనియారిటీ (ఉద్యోగకాలాన్నిబట్టి సంపాదించే ఆధిక్యత), ఇప్పుడు అమలులో ఉన్న వేతన ప్రమాణాలు ఉద్యోగ పరిస్థితులు, ఉన్న స్థాయికన్న దిగజారి పోకుండా చూడడం. దేశవ్యాప్తంగా అమలు జరుపడానికి వేతన ప్రమాణాలు నిర్ణయించే పర్యంతం ఇవి దిగజారిపోకూడదు. ఇప్పుడున్న రాష్ట్రాలలో ఆయా ఉద్యోగులకు ఉన్న సదుపాయాలకు భంగం కలుగకూడదు.

కాగా, ఈ విలీన కార్యక్రమ నిర్వహణకు నెలకొల్పే సంఘం, ఉద్యోగులందరికీ తమకు అన్యాయం జరుగదన్న విశ్వాసం కలిగించే పద్ధతిలో ఏర్పాటు కావాలి.

ఈ విలీన కార్యక్రమంలో ఏదైనా ఒక నిర్ణయంపై ఒకరికి నచ్చకపోతే - ఆ విషయం విచారించడానికి ఒక్క అప్పీలు మాత్రమే చేసుకోవడానికి అనుమతించాలి.

అఖిలభారత స్థాయి ఉద్యోగాలను అవతరించనున్న కొత్త రాష్ట్రాలకు కేటాయించడం కేంద్రప్రభుత్వం చూసేపని. మిగతా ఉద్యోగాల కేటాయింపు వ్యవహారమంతా రాష్ట్రప్రభుత్వాల బాధ్యత. ఈ సందర్భంలో ఒక విషయం చెప్పవలసి ఉంది. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణవల్ల కొన్ని చిన్న రాష్ట్రాలూ కొన్ని పెద్ద రాష్ట్రాలూ కలుస్తాయి. అటువంటి సందర్భాలలో చిన్న రాష్ట్రాలు, పెద్దవాటిలో 'చేర్చబడిన' ప్రాంతాలుగా పరిగణించ తగదు. ఆ భావానికి ఆస్కారం ఇవ్వకూడదు.

ఈ మధ్య ఒక ప్రముఖ నాయకుడు ఈ విషయం ప్రస్తావిస్తూ, చిన్నరాష్ట్రాలలో పనిచేస్తున్న ఉద్యోగులకు న్యాయం కలగచెయ్యాలని, ఆ మాటకొస్తే, వారిపట్ల ఔదార్యంతో వ్యవహరించి, ఎవరికీ, అసంతృప్తి చింత కలుగకుండా చూడాలనీ నొక్కి చెప్పారు. ఇది ముఖ్యమైన విషయమే. ఆయా రాష్ట్రాల పరిపాలనా వ్యవస్థను, పునర్వ్యవస్థీకరించినపుడు ఈ విషయమై ప్రత్యేక శ్రద్ధ వహించడం అవసరం.

జరగవలసిన కార్యక్రమందృష్ట్యా ఇపుడు అఖిలభారత స్థాయిలో ఇంజనీరింగు, అటవీ, వైద్య, ఆరోగ్య వ్యవహారాల శాఖలు నెలకొల్పడం అవసరం.

ప్రాంతీయ దురభిమానాలు అరికట్టడం, సర్వే సర్వత్రా విశ్వాసం కలిగించడం జరగాలంటే, పైనచెప్పిన పద్ధతులతోపాటు, ప్రతి హైకోర్టులోనూ నియమించే న్యాయమూర్తులలో కనీసం మూడోవంతును ఇతర రాష్ట్రాలనుండి తీసుకోవడం కూడా జరగాలి. ఉద్యోగ నియామకం జరిగినపుడు, ఆయా వ్యక్తుల ప్రతిభ, అనుభవం, శక్తిసామర్థ్యాలు, అతి ప్రధానంగా పరిగణించాలి. సువిశాలమైన మనదేశంలో ప్రాంతీయ అభిమానం అనేది ఉండక తప్పదు కాని, దానికి హద్దు ఉండాలి. అది ప్రాంతీయ దురభిమానం కాకూడదు. మన రాజకీయ జీవనంలోనే కాక, ఆర్థిక రంగంలో కూడా అఖిలభారత శ్రేయస్సుకు ప్రాధాన్యం ఉండాలి. ఈ సత్యాన్ని దీని ఆవశ్యకతను సర్వే సర్వత్రా గుర్తించి, గౌరవించి, పాటించిననాడు, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణవల్ల, రాజకీయ సమరాలు బయలుదేరడానికి అవకాశం ఆస్కారం ఉండదు. ★

# చక్రవర్తి సత్కారం

ప్రాచీన గాథాలహరి

పి. గణపతిశాస్త్రి

ఆనాటి అపరాహ్ణవేళ విక్రమాదిత్య చక్రవర్తి ఆస్థానం అంతా ఆనందడోలికలలో ఉయ్యాల లూగిపోయింది! చక్రవర్తికది లేక లేక కలిగిన సంతానం! అందులోను మగశిశువు! ఇక ఆ పసికందే సార్వభౌముని అనంతరం సామ్రాజ్యభారం వహింపబోతున్నాడు! అందువల్ల అది చక్రవర్తికే కాక సామ్రాజ్యానికంతటికీ మహోత్సవమే! ఇక రాజధాని ఉజ్జయినీనగరము, రాజాస్థానము ఈ మహోత్సాహంలో తలమునకలైపోవడంలో ఆశ్చర్యం ఏమి ఉంది!

ఆనాటి నిండుపేరోలగంలో చక్రవర్తి విద్వాంసులకు, కవులకు, గాయనీవర్తకీ మణులకు రత్నాంగుళీయకాలు, అమూల్యములైన చీనీచీనాంబరాలు, అగ్రహారాలు, కోకొల్లలుగా బహూకరించాడు! ఈబహూకృతి జరిగిన పిమ్మట సార్వభౌముడు విద్వాంసులనందరినీ శిశువు జాతకచక్రం పరిశీలించి ఫలితాలు చెప్పవలసిందని ప్రార్థించాడు. విక్రమాదిత్యుడంతటి విద్వత్ప్రభువు 'ప్రార్థన' కంటె విద్వాంసులకిక వేరే ఏమికావాలిగనక! అందరు తమతమ హస్తాల్లోఉన్న ఆ శిశువు జాతకం పరిశీలనలో మునిగిపోయారు! అవి భూర్జరపత్రాలమీద లాక్షారసంతో లిఖించిన జన్మపత్రికలు. పండితులే కాక చక్రవర్తికూడా స్వయంగా జాతకం పరిశీలిస్తున్నాడు! ఆస్థానజ్యోతిర్విద్వాంసుడు ఆదిత్యభట్టారకుడు వేళ్లు మడిచి మీనమేషాలు లెక్కపెడుతూ మధ్యమధ్యన చక్రవర్తి ముఖకవళిక లోకకంట కనిపెట్టి చూస్తున్నాడు.

మధ్యాహ్నం మూడుయామాలు గడిచిపోయాయి. దానికి సూచనగా రాజప్రాసాదం గోపురంమీద గంభీరంగా భేరీధ్వనులు మారుమోగాయి. కొంతసేపటికి ఆ సమీపంలో మహాకాళనాథుని దేవాలయం గంటల గణగణలు వినిపించాయి. తరువాత "హర! హర! మహాదేవశంభో! జయ! మహాకాళనాథా! జయ!" ఇత్యాది జయజయధ్వానాలు గంటల గణగణలలో కొంచెం అస్పష్టంగా వినిపించాయి.

చక్రవర్తి కిరుపైపులా ఒయ్యారంగా నిలిచిన చామరగ్రాహిణులు వింజామరాలు వీస్తున్నారు. వారిద్దరికీ కొంచెం వెనక తాంబూలకరండకం బుజంమీద ధరించిన మరి ఒక సుందరి చిత్రప్రతిమలా నిలబడి, విద్వాంసు లెవరికైనా కర్పూర తాంబూలాల అవసరం కలగగలదేమోనని రెప్పవెయ్యకుండా నిరీక్షిస్తున్నది. గవాక్షులద్వారా ప్రసరిస్తున్న ఎండపొడలు రాజసభలో పరిచిన రత్నకంబళ్ళమీద పడి వింత వింత రంగులు వెదజల్లుతున్నాయి. అప్పుడప్పుడా కిరణాలుపడి అటు ఇటు కదులుతున్న తాంబూల కరండక వాహిని పైడికుండలాలు తళ తళ మెరుస్తున్నాయి. పక్కగా ప్రవహిస్తున్న శిప్రానది తరంగాల రొద ఉజ్జయినీనగరం ఉత్సవకోలాహలాని కొక మంద్రశ్రుతిగా వినవస్తున్నది.

కొంతవరకు జాతకపరిశీలన జరిగిన తరవాత చక్రవర్తి చూపు లాస్థాన జ్యోతిషికునిమీద పడ్డాయి. ఆ విద్వాంసుడు వెంటనే లేచి నిలబడి సవినయంగా చేతులు జోడించి కొంచెం సంకోచిస్తూ—

"మహాప్రభూ! నా దొక్క మనవి! మొదటినించిన్నీ ముఖస్తుతి చేస్తాననే అపప్రథ ఒకటి నామీద పడిఉన్నది! ఇందువల్ల నా క్షేమనడానికిన్నీ పాలుపోవడం లేదు!" అన్నాడు.

చక్రవర్తి పెదిమలపై ఒక చిన్న చిరునవ్వు చిందులు దొక్కింది! 'ఆ సంకోచమేమీ ఉండనక్కరలేదు! యథేచ్ఛగా మాట్లాడవచ్చును!' అని ఆ చిరునవ్వుల పరమార్థం. జ్యోతిషికుడాపైన జాతకచక్ర ఫలితం ఇలాగ విన్నవించుకొన్నాడు.

"సార్వభౌమా! రత్నాల గనిలో గులకరాయి బయలుదేరదుగదా! జాతకం పరిశీలిస్తూంటే 'ఆ దేవేంద్రుడే విలాసార్థమై ఈ ఉజ్జయినిలో అవతరించాడా!' అన్నట్టుగా ఉంది! భాగ్య రాజ్యాధిపతులు పరమోచ్చస్థులై ఉన్న శుభసమయంలో యువమహా సార్వభౌము లవతరించారు! ఆపైన బలమైన శుభగ్రహ వీక్షణం కూడా తోడైంది! ఇక వేరుగా విన్నవించవలసిం దేమున్నది! మహాప్రభూ! జాతకుడు చతుస్సముద్ర వేలావలయిత భూమండలానికంతటికీ ఏకచ్ఛత్రాధిపత్యంవహించి, తమ ప్రతాపంకూడా కొంచెం కించపరచగలడనే అనిపించింది!"

అని చక్రవర్తి ముఖంవైపు, మిగిలిన సభ్యుల ముఖాలవైపు చూస్తూ నెమ్మదిగా తన ఉన్న ఆసనంమీద ఆసీనుడైనాడు.

చక్రవర్తి, మిగిలిన సదస్యులు ఈ శుభ ఫలితాని కెంతో ఆనందించారు. పిమ్మట విక్రమాదిత్యుని కటాక్షవీక్షణం మిహిర పండితునిమీదికి తిరిగింది.

అతడు అత్యంత భయభక్తులతో లేచినిలుచుని—

"ప్రభూ! నేనెప్పుడు అశుభ ఫలితాలే చెబుతానని అపకీర్తిపొంది ఉన్నవాణ్ణి! ఈ శుభసమయంలో నావంటి శకునపక్షి ప్రసంగం సముచితం కాదు. నన్ను మన్నించండి!" అని వెంటనే కూర్చోబోయాడు. కాని చక్రవర్తి దానికనుమతించలేదు అందుచేత మిహిరపండితుడు తిరిగి సవినయంగా శిరస్సువంచి—

"జాతకం స్థూలదృష్టికి ఆస్థాన విద్వాంసులు చెప్పినట్టుగానే కనిపిస్తున్నది. కాని ప్రబలమైన బాలారిష్టదోషం ఒకటి పట్టి ఉంది. అది ఉంటే ఎన్ని మహారాజయోగాలు పట్టినా—అవి ఏమీ ఫలించవు!" అని ముక్తసరిగా మూడువాక్యాలలో తన ప్రసంగం ముగించివేసి కూర్చున్నాడు. దీనితో జాతకపత్రికలు పరిశీలిస్తున్న మిగిలినవారందరిమీద ఒక పెద్ద పిడుగు పడ్డట్టయింది! ఆస్థాన జ్యోతిర్విద్వాంసుని కళ్లు జేవురించాయి! చక్రవర్తి లోణకాలేదు! బెణకాలేదు. ఆస్థాన విద్వాంసుడు మరి చక్రవర్తి కనుసన్న కోసం వేచిఉండలేక చరచరలేచి నిలుచున్నాడు! కాని దానికి విక్రమాదిత్యుని అంగీకారముద్ర పడలేదు! ఇక



"మహాప్రభూ! ఇది మీ అపారమైన ఔదార్యానికి మాత్రమే తార్కాణం!"
అన్నాడు మిహిరుడు సువర్ణవరాహ బహూకృతి స్వీకరిస్తూ.

చేసేదేమీ లేక నిలుచున్నపళంగానే తన స్థానంలో చతికిలబడిపోయాడు.

మిగిలిన విద్వాంసులంతా ఇకముందు క్షణంలో ఏమి జరగనున్నదో అన్న ఆత్రంతో చక్రవర్తి కనుసన్నలు నిరీక్షిస్తూ ఉద్విగ్నంగా వేచిఉన్నారు.

"ఇంతకీ ఘటకర్పర కవీశ్వరు లేమంటారో!" అన్నాడు విక్రమాదిత్యుడు. అందరు ఆశ్చర్యపోయారు! ఘటకర్పర కవికి జ్యోతిషశాస్త్రంలో ఉన్నది కేవలం శ్రుత పాండిత్యమే.

ఘటకర్పరకవికూడా ఈ చర్చలో తన ప్రసక్తి రాగలదని అనుకోలేదు! అయినా ప్రభువు ఆజ్ఞ అయిన తరవాత మరి మాట్లాడకపోతే బాగుండదనుకొని కంగారుగా లేచి ఇలాగ విన్నవించాడు.

"నాది శ్రుతపాండిత్యమే నన్నది ప్రభువుగారికి తెలియని విషయంగాదు! కేవలం వినోదార్థమై నన్నిప్పుడిలాగ ఆజ్ఞాపించి ఉంటారనే అనుకుంటున్నాను. అయితే— ఇన్నాళ్లనించీ కవితావధూమణి ఒక్క కవుల సొమ్మేనని భావించేవాణ్ణి! ఈనాడీ విద్వాంసుల ప్రసంగాలాలకించిన తరవాత—ఇక ఆవధూమణి జ్యోతిష విద్వాంసుల కైవసమైపోయిందని తోచింది! ఇకనించీ నేనీ కవితాపరిశ్రమ విరమించుకొని నాలుగు జాతక చక్రాలు గుణించుకుంటూ కూర్చుంటే జీవితం సుఖంగా వెళ్లిపోతుందని భావిస్తున్నాను. ఈవేళ వీరి ప్రసంగాలు విని బ్రహ్మానందభరితుణ్ణైనాను."

సభాస్తారులంతా స్థూలంగా కవి చమత్కృతి గ్రహించి కలకల నవ్వారు! చక్రవర్తి కవి వాక్కులోని లోలోపలి వ్యంగ్యాలు, ఈసడింపులు గ్రహించి గుంభనగా ఒక నవ్వు నవ్వి, వెంటనే ఆ కవి పక్కనే సుఖాసీనుడై ఉన్న న్యాయశాస్త్ర విద్వాంసుడు భేతాళభట్టు వైపు తిలకించాడు. ఆయన తర్కశాస్త్రంలో నిధి. చక్రవర్తికి ప్రత్యేకాభిమానం ఉన్న శాస్త్రం కనక జ్యోతిషంలో కూడా బాగా పరిశ్రమ చేశాడు. భేతాళభట్టు దిగ్గున లేచి చక్రవర్తి కిలాగ విజ్ఞాపన చేసుకొన్నాడు.

"మహారాజా! ఏలినవారొక్క విషయం సావధానంగా దివ్యచిత్తానికి హత్తించుకోవాలని విన్నవించుకుంటున్నాను. ఆస్థాన జ్యోతిష విద్వాంసులైన ఆదిత్యభట్టారకులు ఆర్షజ్యోతిషంలోను, లౌకిక జ్యోతిషంలోను దిగ్దంతులు! తమ సువిశాల సామ్రాజ్యంలో వారికి సాటి రాగలమేటివిద్వాంసు లెవ్వరులేరు! వారివాక్కు సాక్షాత్తు వేదవాక్కు! ఇక మిహిరపండితుల మాట! వీరికీర్తి దిగ్దిగంతాలవరకు వ్యాపించిందిగదా! పశ్చిమదేశాలనించి వచ్చిన యవనవిద్వాంసులుకూడా వీరి పాదసన్నిధిని ఈ శాస్త్రం అభ్యసిస్తున్నారంటే—ఇక వీరి ఘనతవిషయం నేను వేరుగా విన్నవించవలసింది ఏమి ఉంది! పైగా వీరు యవనశాస్త్రవేత్తల అపూర్వ రహస్యాలు కూడా కూలంకషంగా అవగాహన చేసుకొన్నవారాయెను! వీరిద్దరిలోను మనం ఎవరిని కాదనగలం! అయితే ఈ ఇద్దరు యువసార్వభౌముల జాతకం కూలంకషంగా అవలోడన చేసి కేవలం పరస్పరవిరుద్ధమైన ఫలితాలు సెలవిచ్చారు! ఈశాస్త్రానికి వీరిద్దరు సూర్యచంద్రులవంటివారుగదా!......... ఆలోచించగా—ఆలోచించగా నాకు—జ్యోతిశ్శాస్త్రంలోనే ఏదో గొప్పలోపం ఉన్నట్టు భాసిస్తోంది! అసలీశాస్త్రం తర్క వ్యాకరణాది శాస్త్రాల సరసన కూర్చోబెట్టడానికి తగినశాస్త్రమే కాదని నా అనుమానం! ఈ నుధ్యన ఈశాస్త్రం లోతులు కొంచెం ఆకళించుకొన్న తరవాత నావంటి అల్పుడికి తోచిన అభిప్రాయం ఇది! ఆపైన మరి దేవరవారి చిత్తం!"

ప్రసంగా లీవిధంగా పాకంలోపడ్డ తరవాత ఆస్థానవిదూషకుని కిక ఉండబట్టలేదు! చక్రవర్తి సెలవులేకుండానే ఆదరాబాదరాగా—అర్ధకుసిగా లేచి నుంచుని తన ఘోష వెళ్ళబోసుకున్నాడు.

"భూలోక దేవేంద్రా! స్వయంగా శాస్త్రవేత్తలై ఉండికూడా తర్కపండితులు జ్యోతిషంవంటి మహాశాస్త్రమే — "సర్వం మిథ్య" అని కొట్టిపారేశారు! నిజానికన్ని శాస్త్రాలు అంతే! కనకనే చిన్నవాడే నేను శాస్త్రాభ్యాసానికి స్వస్తి చెప్పి హాయిగా ఆగమ్యకోకిలా తిరిగాను! ఈ విజ్ఞానం యావత్తూ నాకు బాగా పసిప్రాయంలోనే అబ్బింది! ఏలినవారు నన్ను వట్టి హాస్యగాడని కొట్టిపారేస్తారుగాని, ఈ మహాస్థానంలో విద్వద్విభుదం ఇచ్చి గౌరవింపదగినవాణ్ణి నేనొక్కణ్ణేనని నాకిప్పుడు గట్టి ధీమా కలిగింది!"

విదూషకుని ప్రసంగం ముగిసేసరికి ఆస్థానం అంతా ఒక్కసారిగా విరగబడి నవ్వింది! గభీరముద్ర వహించిన చక్రవర్తి కూడా నవ్వకుండా ఉండలేకపోయాడు! చివరికి తాంబూల కరండకగ్రాహిణి, చామరగ్రాహిణులుకూడా తమ సహజ వినయం విడిచివేసి కలకల హాసాలు చిలకరించారు!

**చాకచక్యం**

ఆపరేషన్ పూర్తి అయిన కొంతసేపటికి రోగి కళ్లు తెరచాడు. "అంతా సవ్యంగా జరిగిందా బాబూ?" అన్నాడు నీరసంగా.

డాక్టరు అప్పటికే తన విజయానికి మురిసిపోతున్నాడు.

"ఓ. నిక్షేపంలాగ. ఒకసారికూడా నా చెయ్యి తెగలేదంటే నమ్మండి" అన్నాడు విలాసంగా.

కాని జ్యోతిషవిద్వాంసు లిద్దరు ఈ అవహేళన కేమీ చెయ్యలేక వెలవెలబోయారు! మిహిర పండితుడు మాత్రం లేని చిరునవ్వు తెచ్చిపెట్టుకున్నాడు. ఆదిత్య భట్టారకుడు మిహిర పండితుడు మాట్లాడినప్పటినుంచీ లోలోపల అట్టుడికిపోతున్నట్టుడికిపోతూనే ఉన్నాడు! విదూషకుని ప్రసంగంతో అతనికి అరికాలిమంట నెత్తికెక్కింది! ఒక్కసారిగా దూసివకత్తిలా లేచి నిలబడి— "మహాప్రభూ! తమరు ధర్మప్రభువులై ఉండికూడా వేదాంగమైన జ్యోతిశ్శాస్త్రానికి విపంగా అపచారం జరుగుతూంటే సహించి ఊరుకోవడం న్యాయంకాదు!— నావిజ్ఞప్తికి కూడా కొంచెం అవకాశం ఇప్పించవలసిందని వేడుకొంటున్నాను." అన్నాడు!

దీనితో సభలోనివారంతా ఒక్కసారిగా శిలాప్రతిమల్లా నిర్ఘాంతపోయారు! చనువిచ్చినంతమాత్రాన ముందు వెనకలు చూసుకోకుండా చక్రవర్తిపై ఈవిధంగా నిందమోపడం సభామర్యాద లక్షణం కాదని వారిలో వారు గుసగుస లాడుకున్నారు. కాని చక్రవర్తి అల్లాగే ఉల్లాసంగా నవ్వుతూ ఆదిత్యభట్టారకునికి ప్రసంగాని కంగీకరించాడు.

దానితో భట్టారకునికోపం కొంచెం శాంతించింది. అత డిలాగన్నాడు.

"ఈ యవన సంసర్గం ఏర్పడినప్పటినించీ మన ప్రాచీనార్ష సంప్రదాయాలన్నీ గంగలో కలిసిపోతున్నాయి. తత్రాపి వేదాంగజ్యోతిషం మరీ భ్రష్టమైపోయింది. ఈ విషయం తమ దివ్యచిత్తానికి తేవాలని నే నిన్నాళ్లనించీ తాపత్రయ పడుతున్నాను.

# ★ చక్రవర్తి సత్కారం ★

—ఇక మా ప్రస్తుత వివాద విషయం! మిహిరపండితులు యువ సార్వభౌముల జన్మపత్రికలో ఏదో అస్పష్టమైన బాలారిష్ట దోషం ఉన్నదని ఉట్టంకించి ఉన్నారు! ఈ అస్పష్ట ఫలితాలవల్లనే ఈ శాస్త్రం ఈ విధంగా నవ్వులపాలైపోతున్నది! కనక విస్పష్టంగా ఆ బాలారిష్టం సంభవించే సమయము, ఆ అరిష్టస్వభావము వివరించవలసిందని వారిని సవినయంగా వేడుకొంటున్నాను!”

మిహిర పండితుడిక ప్రసంగించదలుచుకోలేదు. ఏదో అస్పష్టంగా - ముక్తసరిగా సమాధానం చెప్పవలెనని అనుకున్నాడు. కాని చక్రవర్తి దాని కంగీకరించలేదు! విధిలేక అతడిలా గన్నాడు.

“ఈమహోత్సవసమయంలో ఈ విధంగా ప్రసంగించవలసి వచ్చినందుకు ప్రభువులు, సభ్యులు నన్ను మన్నించవలెనని ప్రార్థిస్తున్నాను. నేను యవనవిద్వాంసులచేత ఆర్ష జ్యోతిషం అధ్యయనం చేయించినమాట-యథార్థమే. వారివద్ద స్వయంగా కొన్ని శాస్త్రరహస్యాలు గ్రహించినమాట-యథార్థమే! కాని అంతమాత్రంచేత ఆర్షశాస్త్ర సంప్రదాయానికి నేను చేసిన అపచారమేమీ నా కవగతంకాలేదు! ఇక నేను చెప్పిన జోస్యంవిషయం మనవిచేస్తున్నాను. ఈజాతకునిఆయుర్దాయం మరి రెండుసంవత్సరాలే! మూడవ సంవత్సరం ప్రారంభంలోనే వనవరాహంవల్ల అరిష్టం సంభవించగలదు! అప్రియం చెప్పినందుకు నన్ను మన్నించవలసిందని తిరిగీ విన్నవించుకొంటున్నాను!”

మిహిరపండితుడీ మాటలనగానే సభలో పిడుగుపడ్డట్టయింది! సభాస్తారులంతా నిర్ఘాంతపోయారు! చక్రవర్తికేమీ పాలుపోక విచారంగా మౌనముద్ర వహించాడు.

“ఆదిత్య భట్టారకులకు నాదొక్క మనవి” అన్నాడు విదూషకుడు హఠాత్తుగా లేచి నిలబడి. చక్రవర్తి ప్రశ్నార్థకంగా కనుబొమలు ముడిచాడు.

“మరి యువసార్వభౌములపట్టాభిషేకం ఏ సంవత్సరంలో జరగగలదో వారు విస్పష్టంగా తెలియజెయ్యవలసిందని నాప్రార్థన” అన్నాడు విదూషకుడు!

భట్టారకుడు ఠీవిగా నిలబడి “సరీగా నేటికి 20 సంవత్సరాల అనంతరం ఈ సభామంటపంలోనే — చక్రవర్తి స్వయంగా యువమహారాజులుంగారికి సామ్రాజ్యాభిషేకం జరపగలరు! ఇది ముమ్మాటికీ నిశ్చయం! యువసార్వభౌమునికి జయం! జయం!” అన్నాడు.

సభ్యులందరు ఆనందంతో ఒక్కసారిగా జయం! జయం!! అన్నారు. ఆ హర్షధ్వానాలతో సభలో హఠాత్తుగా వర్షం కురిసి వెలిసినట్లయింది.

విదూషకుడు తిరిగీ లేచి నిలబడి చక్రవర్తికెదురుగా దీనంగా ముఖంపెట్టి అతివినయంగా చేతులుకట్టుకుని “పోనీ ఆనాటికైనా నన్ను తమ ఆస్థానవిద్వాంసుణ్ణిగా ఏర్పాటు చేయించవలసిందని నాప్రార్థన!” అన్నాడు. సభలో వెంటనే ఉవ్వెత్తుగా కలకలహాసం చెలరేగింది నాటికి పరిషత్తు ముగిసిపోయింది.

## 2

పిమ్మట కాలక్రమంలో రెండుసంవత్సరాలు రెండుదివసాలుగా గడిచిపోయాయి. చక్రవర్తికి జ్యోతిర్విద్యమీద గాఢాభిమానం ఉన్నమాట వాస్తవమే! అయితే గొప్ప గొప్ప విద్వాంసులు చెప్పిన భావిఫలితాలు కూడా ఒక్కొక్కప్పుడు తప్పిపోతూండడంవల్ల ఆ శాస్త్రంమీద నయితేనేమి - శాస్త్రజ్ఞులమీదనయితేనేమి - కొంత కొంత అవిశ్వాసం ఏర్పడినమాట - వాస్తవమే!

కానిభవిష్యత్తువిషయంలో తహతహపడని మహామహులు చాలా అరుదుగా ఉంటారు! అందులోను చక్రవర్తికి లేక లేకకలిగిన కుమారుడు! అతడు సామ్రాజ్యానికంతటికీ ఒకేఒక వారసుడు! అవధి సమీపించినకొద్దీ ఎంతగా జ్యోతిశ్శాస్త్రం కాదనుకొన్నా-చక్రవర్తికి లోలోపల కుమారుని భవిష్యత్తు విషయమై కొంచెం భయం ప్రారంభమైనది! ఆదిత్యభట్టారకుడు, మిహిరపండితుడు ఇద్దరు కొన్ని శాంతిక్రియలవల్ల భావిదుష్ఫలితాలు కొంతవరకు ఉపశమించవచ్చునని అంగీకరించారు! అందువల్ల చక్రవర్తి రాజపురోహితుణ్ణి పిలిపించి - అనేకమైన అరిష్టశాంతిహోమాలు, దానధర్మాలు యజ్ఞయాగాలు చేయించవలసిందని ఆజ్ఞాపించాడు. మొట్టమొదట రెండేళ్లయినా నిండీ నిండని పసిబాలకునికి వనవరాహం మూలంకంగా మృత్యువు సంభవించగలదంటే ఎవరికీ విశ్వాసం కలగలేదు. చక్రవర్తికి ఈ మాటల్లో ఉన్న ఔచిత్యం గోచరించకపోలేదు! అయినా అంతఃపురం ఉద్యానవనాల పరిసరాలలో ఎక్కడా అడవిపందుల పసికూనలు కూడా కనబడకూడదని గట్టిగా కట్టడి చేశాడు. మొదట అరణ్యాల్లో వనవరాహాల నామరూపాలు లేకుండా రూపుమాపి వెయ్యాలనిసంకల్పించాడుగాని — యజ్ఞవరాహమూర్తి ప్రాచీనకాలంనుంచీ చక్రవర్తి వంశీయుల కులదైవం. వారి పతాక చిహ్నంకూడా యజ్ఞవరాహమే! అందువల్ల ఆ ప్రయత్నం విరమించి అరణ్యాల్లో వనవరాహాలు సంచరించే ప్రాంతాలకు గట్టి పరిమితులు ఏర్పాటు చేయించాడు. రాజకుమారునికి ఏవిధమైన అపాయము సంభవించకుండా అహోరాత్రాలు - కంటికి రెప్పలా కాపాడవలసిందని ఆజ్ఞాపించాడు.

మూడవ సంవత్సరం ప్రారంభంలోనే అరిష్టం సంభవించగలదని మిహిర పండితుడు జోస్యం చెప్పాడుగదా! ఆ ప్రారంభం అంటే ఎంతకాలమో విస్పష్టంగా తేల్చి చెప్పవలసిందని చక్రవర్తి పండితుణ్ణి ప్రశ్నించాడు.

“మహాప్రభూ! మూడో సంవత్సరంలో మొదటి మాసంలోనే ఆ అరిష్టం సంభవింపగలదు.”

“శాంతిక్రియలవల్ల ఈ అరిష్టం శాంతించదా?”

“అది కొంతవరకే శాంతిస్తుంది. కాని జాతకుని కంటకంటె ఒక్కక్షణంకూడా ఆయుర్దాయం లేదు!”

“అది ఆ మాసంలో ఏ క్షణంలో జరగగలదో తెలియదా?”

మిహిరుడు కొంచెంసేపాలోచించి, “తెలుసుకోవచ్చునుగాని - నా శాస్త్రజ్ఞానం బహు పరిమితం! అదిన్నీగాక గ్రహగతిని బట్టి శాస్త్రజ్ఞులు భవిష్యత్తు సూదనా ప్రాయంగానే నిర్ణయిస్తారు. అంతేగాని అల్పాల్పమైన తారతమ్యాలెవరు నిర్ణయించి చెప్పగలరు! అది తెలిసినవాడా దైవం ఒక్కడే!” అన్నాడు.

ఆ పిమ్మట ఆ మూడోమాసంకూడా చాలా వరకు గడిచిపోయింది. క్రమంగా వసంతం ముదిరి గ్రీష్మం ప్రారంభమైనది. ఆ మూపావధి సమీపించినకొద్దీ పుత్రప్రేమవల్ల విక్రమార్కుని హృదయంలో భయాందోళన లెక్కువైనాయి. ఆస్థాన జ్యోతిష పండితుడు, అమాత్యులు ఇక ప్రాణాపాయం దాటిపోయినట్లేనని చక్రవర్తికనేక విధాలుగా ధైర్యం చెప్పారు! అయినా చక్రవర్తి హృదయంలో నిత్యము అరణ్యవరాహాలు గాండ్రిస్తున్నట్లే ఉండేది!

మానవహృదయంలో భీభత్సంగా పెల్లుబి

## కీ॥ శే॥ వేమూరి గగ్గయ్య

సుప్రసిద్ధ నటుడు శ్రీ వేమూరి గగ్గయ్య గతమానం 30-వ తేదీన స్వర్గస్థులయినారు. వీరి మృతి నాటక, సినిమా అభిమానులకు చాలా విచారకారణం. వీరు స్టేజి నటుడుగానూ, సినిమా నటుడుగాను తెలుగువారి మన్ననలను చూరగొన్నారు. అనేక పౌరాణిక చిత్రాలలో నటించి ఒకప్పుడు అసంఖ్యాక ప్రేక్షకులను రౌద్ర భయానకరస వివశులనుచేశారు. పౌరాణిక చిత్రాలపై జనుల మోజు మళ్ళిన తరువాత వీరు సినిమాలనుండి విరమించుకున్నారు. కాని నాటకాలు వేస్తూనే వచ్చారు. పక్షవాతంతో బాధపడుతూ కాలధర్మం చెందారు.

---

కిన భయాందోళనలే ఒక్కొక్కప్పుడు భౌతికరూపాలు ధరిస్తూంటాయి. ఆనాటి రాత్రి గ్రీష్మాధిక్యంవల్ల బాగా ఉక్కపోసింది. చక్రవర్తి రాజప్రాసాదంమీద శిశువుశయ్యకనతిదూరంలోనే హంసతూలికాతల్పంపై పవ్వళించి, కలతనిద్రలో ఏదో కలవరించాడు. దిగ్గనలేచి కూర్చున్నాడు! అతనికి అరణ్యవరాహం మేడమీదికి దూకివచ్చి యువసార్వభౌముని హృదయం వాడి కోరలతో చీల్చివేసినట్లుగా కల వచ్చింది! కాని లేచి చూచిన తరవాత అదంతా భ్రాంతి మాత్రమే అని స్పష్టపడింది!

చక్రవర్తి దైవధ్యానంచేసి తిరిగి పవ్వళించాడు. ఎక్కడా అకల్లోడపం లేదు. గాలి స్తంభించింది. నల్లనల్లగా కారుమబ్బులు కమ్ముకున్నాయి! ఉండి ఉండి హఠాత్తుగా ఝంఝామారుతం వీచింది! ఫెళఫెళధ్వనులతో పిడుగుపడింది. కెవ్వని కేక వినిపించింది. చక్రవర్తి లేచి ఒక్క అంగలో శిశువు శయ్యదగ్గరికి చేరుకున్నాడు! ఎదురుగా రక్తసిక్తమైపోయిన శయ్య! పరిజనులంతా పరుగెత్తుకువచ్చారు! మొదట ఈ ఘోర దారుణానికి కారణమేమో ఎవరికీ తెలియలేదు. కొందరు పిడుగుపడి ఉంటే వచ్చుననుకొన్నారు. రాజ ప్రాసాదంపై ప్రతిష్ఠించిన పతాకంపై నిలిపిన లోహవరాహమూర్తి వాడి కోరలు శిశువు హృదయం చీల్చివేశాయి! గాలి తాకిడికా పతాకం విరిగి నేలపై ఒరిగి అక్కడే పడిపోయింది. వేగరులు రాజవైద్యులకోసం పరుగులు పెట్టారు. వారంతా శాయశక్తులా చికిత్సలు చేశారు. కాని విధి బలీయమైపోయింది.

### 3

ఈ వార్త ఉజ్జయినీ నగరం అంతటా కార్చిచ్చులా వ్యాపించింది. ఈ సంఘటనపై విద్వాంసులు తమలో తాము నేక విధాలుగా వాదోపవాదాలు సాగించారు. కొందరు మిహిరుని జోస్యం అక్షరాలా ఫలించిందన్నారు. మరికొందరది వనవరాహం కాకపోవడం వల్ల జోస్యం పూర్తిగా తప్పిపోయినట్లే అని చప్పరించేశారు.

అటు తరవాత రెండుమూడు నెలలవరకు చక్రవర్తి ఆస్థానంముఖమే చూడలేదు! సన్నిహితులైనవారెవరికోగాని చక్రవర్తి దర్శనమే కాలేదు!

ఆదిత్యభట్టారకుడు తన జోస్యం తప్పినా మిహిరుడు చెప్పినట్లు జరగలేదుగదా! అని చాలా ఆనందించాడు! ఈ దెబ్బతో అతనికి దేవిడీమన్నా జరిగిపోగలదని లోలోపల చాలాఉవ్విళ్లూరాడు. కాని విద్వాంసుల్లో చాలామంది ఆ విధంగానైనా మిహిరుని జోస్యం ఫలించిందికదా! అని పరమానంద భరితులైనారు. ఇంతకీ చక్రవర్తి లోలోపలి నిర్ణయమేమో ఎవరికీ అంతు దొరకలేదు. చక్రవర్తిని ఎంత మంది దర్శించినా-ఆయనతో ఆ విషయం ప్రస్తావించడానికే బెదరిపోయేవారు. అటు చక్రవర్తి-ఇటు మిహిరుడు-ఈ విషయంలో కేవలం ఔదాసీన్యం వహించి ఊరుకున్నారు. అలాగలాగ ఆరుమాసాలు గడిచిపోయాయి.

హఠాత్తుగా విద్వాంసులందరికీ ఆస్థానానికి రావలసిందని ఆహ్వానాలందాయి. అందరు తిరిగి చక్రవర్తి రాజకార్యాలు పరిశీలిస్తున్నారు గదా! అని సంతోషించారు.

విద్వాంసులందరు పల్లకీలెక్కి ఆస్థానద్వారంజేరుకునేసరికి ఆస్థానంఅంతా నూతనాలంకారాలతో కలకలలాడుతూంది! అందరు ఆశ్చర్యపోయారు! లోపలికి వెళ్ళి తమతమ సమున్నతాసనాలపై సుఖాసీనులయినారు. చక్రవర్తి చాలా ఉల్లాసంగా ఉన్నాడు. ఆ ముఖంలో ఎక్కడా విషాదచ్ఛాయే కనిపించలేదు. కొంతసేపటికి చక్రవర్తి మిహిరుని సమ్ముఖాని కాహ్వానించాడు. ఆయన మెల్లిగా అడుగులు వేసుకుంటూ చక్రవర్తి సింహాసన సమీపంలో నిలుచున్నాడు.

చక్రవర్తి బంగారు పళ్లెరంలో ఉంచిన నవరత్నఖచితమైన సువర్ణవరాహం ఆయనకందించబోయాడు! మిహిరుడు తనకన్నులే నమ్మలేకపోయాడు! అటువంటి మహాగౌరవం ఇదివరకెన్నడు ఆ ఆస్థానంలో జరిగి ఉండలేదు! సదస్యులందరు క్షణంలో ఇది గ్రహించుకొని జయజయధ్వానాలు చేశారు!

మిహిరుడు సవినయంగా శిరస్సువంచి-"మహాప్రభూ! దీనికి నేననర్హుణ్ణి! నేనన్నది ఫలించలేదు! ఒకవేళ ఏదో విధంగా ఫలించినా దేవరవారి కది శుభఫలితంకాలేదు!" అన్నాడు.

---

పెళ్ళి భోజనానికి వెళ్ళిన రాముా లడ్డూలు కడుపునిండా తిన్నాడు. పెళ్ళిపెద్ద మళ్ళీ లడ్డూలు వడ్డిస్తూ "రామూ, ఇదిగో ఇంకో లడ్డూ. తినమ్మా" అన్నాడు.

"కడుపులో ఖాళీ లేదండీ. చాలా తిన్నాను," అన్నాడు రామూ.

"పోన్లే, జేబులో వేసుకో. ఇంటికెళ్లాక తినచ్చు."

"జేబులు కూడా ఖాళీగా లేవండి" అన్నాడు రామూ.

---

శుభాశుభాలతో నిమిత్తంలేదు! మీ వైదుష్యానికీ వాక్శుద్ధికీ మాత్రమే ఈ సన్మానం! అదీ గాక రన్నది అక్షరాలా యథార్థమైనది! వనవరాహమని మీరన్నారు! అది లోహప్రతిమే అయినా వనవరాహమే! అది సజీవమా? నిర్జీవమా? అన్న మీమాంస కీవివాదంలో ప్రసక్తేలేదు!" అన్నాడు సార్వభౌముడు.

ఇక మిహిరుని కా సన్మానం అంగీకరించక తప్పలేదు!

"మహాప్రభూ! ఇది మీ అపారమైన ఔదార్యానికి మాత్రమే తార్కాణం?" అన్నాడుమిహిరుడు సువర్ణవరాహ బహూకృతి స్వీకరిస్తూ.

ఆస్థాన విద్వాంసులందరు ముక్తకంఠాలతో తిరిగి జయజయధ్వానాలు చేశారు!

పిమ్మట చక్రవర్తి సవినయంగా మిహిరునికి నమస్కరించాడు.

"సుప్రతాపాప్తిరస్తు" అన్నాడు మిహిరుడు చేతులెత్తి.

"ఇది మీ అమోఘాశీర్వచనం" అన్నాడు చక్రవర్తి.

"ఆశీర్వదించడానికి సమర్థులైన మహనీయులెందరో ఈ ఆస్థానంలో ఉన్నారు. ఆ అర్హత నాకు లేదు. నేను కేవలం తమ జాతక చక్రఫలితం దృష్టితోనే ఈ మాట అన్నాను" అన్నాడు మిహిరుడు!

ఆస్థాన విద్వాంసుల జయజయధ్వానాలు తిరిగి ఇంకొకసారి మిన్నందుకొన్నాయి!

ఆనాటినించీ మిహిరుడు వరాహమిహిరుడనే విశ్వవిఖ్యాతి సంపాదించుకొన్నాడు! 

# వరలక్ష్మీ వ్రతం

ఇరుగుపొరుగులను ప్రేమించడం, మధ్య ఇంట్లో కాపురం ఉన్నవారి విధ్యుక్త ధర్మం. పెద్దల మాటలపట్ల గురి గౌరవం ఉన్న విశ్వేశ్వరరావు పొరుగింట కొత్తగా దిగిన సూర్యనారాయణగారి సుపుత్రి గాయత్రిని ప్రేమించాడు. ఆమె మేడమీది గది కేటాయించుకుందని తెలియగానే, విశ్వేశ్వరరావు పిన్నికీ మా బాబాయికీ నచ్చచెప్పి బతిమాలి తనూ తమ మేడమీది గదిలోకి మారాడు.

పొరుగింటి పంచకల్యాణి ఆమర్నాటికే పైనించి కొంపు ఎత్తేసి, కింద గదిలోకి మారిపోయింది. చదువు మానేసిన గాయత్రికి ఉజ్జీగా తనూ తన గదులు మార్చడంకోసం తలనొప్పి, జ్వరం, కుడిచేయి కొద్దిగా తెగుట, కాలిబొటనవ్రేలికి దెబ్బతగులుట మొదలైన కారణాలు వర్ణించి, విశ్వం ఆఫీసుకి సెలవు పెట్టడం కూడా జరిగింది. అహర్నిశలూ గాయత్రీ జపించినా ఫలితం లేకపోయింది.

గాయత్రి ఇంటికి వస్తుంది. పిన్నితో కబుర్లాడుతుంది తన భోగట్టా శ్రద్ధగానే వింటున్నట్లు కనబడుతుంది. అయినా తను కిటికీలోంచి చూచినప్పుడు, తిరస్కార భావం కనబడేది ఆమె మొహంలో. ఒక్కొక్కసారి తనని చూసి నవ్వుతున్నట్లు కనిపించింది పిన్నిదగ్గిర హేళనగా మాట్లాడినట్లు అనిపించింది.

ఒకానొక ముహూర్తాన తన ఊహలు నిజమేనని నిర్ధారణగా తోచింది విశ్వేశ్వరరావుకి. ఉత్తర క్షణాన, "ఈ పిల్ల నెలాగైనా పెళ్ళాడుతాను" అని ఒట్టుపెట్టుకున్నాడు.

అయినా గాయత్రి ప్రసన్న కాలేదు.

*　　*　　*

శ్రీరామ పఠన మందిరంలో కూర్చుని పత్రికవంక దీక్షగా చూస్తున్న విశ్వేశ్వరరావు పక్కనే ఒక జోగినాథం చేరాడు. అతనుకూడా పత్రికలోకి తొంగితొంగిచూసి చదువుతున్నాడు. ఆ పేజీ అయిపోయింది. పక్క పేజీ చూడాలి. ఎంతసేపటికీ విశ్వం పేజీ త్రిప్పడాయె, జోగినాథం చొరవచేసి పేజీ తిప్పాడు. విశ్వం విసుక్కోలేదు, మేనర్స్ లేవా అని గసరలేదు.

జోగినాథానికి కుతూహలం కలిగింది. పేపరు లాక్కుంటున్నా గసిరికొట్టకపోవడానికి కారణం ఏమిటా అనిపించింది. అంత విరక్తి దేనికా అనిపించింది.

"ఏమిటోయ్ విశ్వనాథం? అలా ఉన్నావూ?" అన్నాడు.

అసలు సిసలు సినిమా హీరోలా అతి మెల్లిగా తలఎత్తి కుడివైపుకి తిప్పి బాధగా చూశాడు విశ్వం.

"తీర్చేవాడివా తీర్చేవాడివా?" అన్నాడు విసుగ్గా.

"తీరుస్తాను, తీరుస్తాను. నీకొచ్చిన కష్టం చెప్పవోయ్" అన్నాడు జోగినాథం.

"అయితే చెబుతా పట్టు. ఏమాత్రం సాయం చేస్తావో"

"పూజా పురస్కారాలు లేక బూజుపట్టి ఉన్నానుగాని, నైవేద్యం పెడు మరి నా మహిమ చూపిస్తాను" అన్నాడు జోగినాథం హుషారుగా.

ఉదయం తొమ్మిది వేళారు. విశ్వం ఒక్క క్షణం ఆలోచించి, జ్వరం వచ్చిందని సెలవు చీటిరాసి, ఆఫీసుకు పంపేశాడు. తరవాత జోగినాథాన్ని వెంటబెట్టుకొని, నైవేద్యం పెట్టడానికి బయల్దేరాడు.

*　　*　　*

ఫలహారాల అనంతరం, ఆత్మకథను నివేదించాడు విశ్వం.

"పంతులూ - 'గాయత్రీ' జపం ఏంపని చెయ్యదు. నువ్వు రేపట్నించే సూర్యనమస్కారాలు ప్రారంభించాలి" అని తూచి తూచి సలహా చెప్పాడు జోగినాథం—

విశ్వం చప్పగా నవ్వాడు.

"అయినా కాకపోయినా సూర్యనారాయణగారు నిన్ననే చెన్నపట్టణం వెళ్లారు. 15 రోజులవరకూ రారట"

జోగినాథం ఊహాలకి బ్రేకుపడింది. ఇంకో సిగరెట్టు ముట్టించాడు "మీ గాయత్రి అమ్మగారి పేరేమిటో తెలుసా?"

"వరలక్ష్మమ్మగారు"

"రైటో. శ్రావణమాసం సగం గడిచిపోయింది. పోతేపోయిందిలే కాని నువ్వు రేపటినించీ వరలక్ష్మీవ్రతం చెయ్యి. మీ మావగారు రాగానే సూర్యనమస్కారాలు ప్రారంభించు. ఆపైన నే చెప్పిన రోజున ఉద్యాపన చేసుకుందువుగాని" అన్నాడు జోగినాథం ధీమాగా.

'సరే' అన్నాడు విశ్వం నీరసంగా.

"మరేం భయంలేదు భక్తిప్రపత్తులతో వ్రతం ఆరంభించి, ఆవిడ వాత్సల్యాన్ని సంపాదించు. ప్రసన్నురాలుగా చేసుకో" అని జోగినాథం, విశ్వానికి వరలక్ష్మీ వ్రత విధానం ఉపదేశించి, ఇంకో సిగరెట్టు పుచ్చుకొన్నాడు.

"పెద్దలను ఖాతరు చేయకుండా, ముఖాముఖి ప్రేమించి పెళ్ళాడబోయిన ఆసాములు ఆట్టే మంది నెగ్గుకొచ్చినట్లు గాథలలో కనబడదు డక్కా మొక్కీలు బోలెడు తిన్నవాణ్ణి నేనూ ఎరగను అందుకని 'అన్యథా శరణం నాస్తి' అని నమ్మి మరీ వ్రతం చెయ్యి" అని హెచ్చరించి, మిగతా సిగరెట్లు తీసుకున్నాడు జోగినాథం.

*　　*　　*

విశ్వేశ్వరరావు, గురూ పదేశాను సారం, మర్నాడు సూర్యోదయాత్పూర్వమే నిద్ర లేచాడు. ప్రకృతి తెల్లగా, చల్లగా, చక్కగా కనబడింది. "ప్రహో పొద్దున్నే లేస్తే ప్రకృతి సౌందర్యం ఆస్వాదించవచ్చు కాబోలు" అనుకున్నాడు వీధిలోకి వెళ్ళి చూశాడు 'గాయత్రి' గుమ్మం కడిగి పసుపు కుంకం పెడుతూంది గాయత్రి, అభినేత్రి, సావిత్రి, రచయిత్రి, కవయిత్రి అని గబగబా అనుకున్నాడు. కాఫీ త్రాగి సైకిలెక్కి, గోదావరి ఒడ్డున ఉన్న ఆంజనేయస్వామి కోవెలకు వెళ్లాడు. పూజారిగారికో నమస్కారం పెట్టి, కోవెల ఆవరణలో పువ్వులు కోసుకున్నాడు. చకచక ఇంటికి [illegible] వచ్చి, పిన్నికి నాలుగు పువ్వు లిచ్చి పెరట్లోకి వెళ్ళాడు. వరలక్ష్మమ్మగారు పెరట్లో ఉన్న మందార, నందివర్ధనం కోసుకుంటోంది 'పువ్వులు కావాలా' అండి అనేశాడు సాహసించి.

వరలక్ష్మమ్మగారు మురిసిపోయింది పువ్వులందుకుంటూ 'శీఘ్రమేవ కల్యాణప్రాప్తిరస్తు' అని ఆశీర్వదించింది చనువుగా.

విశ్వం సిగ్గుపడిపోయాడు.

రవణ

"ఏరా. విశ్వం. ఏం కథ. కొంపతీసి సంధ్యావందనం కూడా చేస్తావేమిటి?" అన్నాడు వాళ్ళ బాబాయ్. బాబాయి పక్కన నవ్వాడు.

"అక్కడికి రోజూ సంధ్యవార్చినట్లు" అన్నాడు విశ్వం సాధ్యమైనంత గట్టిగా. బాబాయిని సావిట్లోకి వెళ్ళనిచ్చి పిన్నిని బ్రతిమాలుకున్నాడు విశ్వం. సంధ్యావందనం సంగతి దండోరా వేయించవద్దని.

"ఒకేయ్. సంధ్యవారుస్తున్నట్లు తెలిస్తే కాలేజీ పిల్ల లెవరూ ఎదురుకట్నం ఇచ్చినా పెళ్ళాడరుసుమా" అందావిడ నవ్వుతూ.

"మరేం ఫరవాలేదు. ఇంటర్ ఫెయిలయినవాళ్లు చాలు. అసలయినా ఇపుడు పెళ్లిగోల వెందుకు? అన్నాడు విశ్వం.

"మరే నాయనా. ఏడుమల్లెపూల ఎత్తు రాజకుమారిని, ఎంత చక్కనిదాన్ని వరిస్తావో చూస్తాంగా" అంది పిన్ని.

* * *

భారతం, భాగవతం, రామాయణం, స్త్రీల వ్రతకథలూ, మొదలైన మంచి పుస్తకాలన్నీ ఎక్కడెక్కడినించో పట్టుకొచ్చి, వరలక్ష్మమ్మగారికి ఇచ్చేవాడు విశ్వనాథం. రోజూ తెల్లవారే సరికి పూలసజ్జ నిండా పువ్వులు కోసుకువచ్చి అందించేవాడు.

శుక్రవారంనాడు విశ్వేశ్వరరావుకి అధికారరీత్యా కాలుకి పెద్దదెబ్బ తగిలినందువల్ల ఆఫీసుకి సెలవు పెట్ట వలసివచ్చింది.

ఆ నాడు వ్రతం అయినందువల్ల అతను తొలి కోడితో మేలుకుని, కాకితో పడున్నాడు.

"ఆయన ఊళ్ళో లేనందుకు, ఈ అబ్బాయి లేకపోతే, వ్రతం, పేరంటం ఎంత అభాసయిపోను" అని వరలక్ష్మమ్మగారు ఊహు ఇదైపోయి పదేపదే ఆ ముక్క అంటూ వచ్చింది. విశ్వం మురిసిపోయి, పరుగున జోగినాథం దగ్గరకు వెళ్లి చెప్పాడు.

"భేష్. కథ దారిన పడింది. కానీ" అని వీపు తట్టాడు జోగినాథం.

* * *

గాయత్రి హిందీ చదువుతోందిట.

"బుధవారం పరీక్షట బాబూ. కాస్త శ్రమనుకోక, ఇవాళా రేపూ దానికి రెండు ముక్కలు చెబుదూ, నాయన్నాయన" అని ప్రాధేయపడింది వరలక్ష్మమ్మగారు.

"ఎంతమాట, తప్పకుండా." అన్నాడు విశ్వం.

"నీకొచ్చిన ఇంతోటి పాండిత్యానికీ ట్యూషనే చెప్పగలవురా! పైగా ఆఫీసు లేదు?" అంది పిన్ని.

"మరేం ఫరవాలేదు రేపూ ఎల్లుండీ అంపకంపాలతో ఊష్టం ఒచ్చేస్తుంది లే." అన్నాడు విశ్వం.

మర్నాడు పదిన్నరకి ఆఫీసు నుంచి కబురొచ్చింది అర్జెంటుగా రమ్మని. అప్పటికి గాయత్రికి పాఠం చెబుతున్న హడావుడిలో, జ్వరం సంగతి మర్చిపోయి విశ్వం ఆఫీసుకుకి వెళ్ళాడు.

"ఏదీ జర్వం?" అన్నారు ఇంటిగారు పక్కన నవ్వి. తనంటే ఆయనకి అభిమానమని విశ్వానికి తెలుసు.

"జ్వరం కదండి. వచ్చే వేళయిందండి. నిన్న ఆదివారం పదకొండింటికి వచ్చిందండి. మళ్ళీ ఇవాళా..." అ నినసిగాడు.

"అబ్బాయ్. ఇకేంకుదరదు. ఇకనుంచి నీకు రెణ్ణెల్లకోసారి తప్ప జ్వరం రాకూడదు ఐదార్నెల్లకొకసారే కాలు విరగొట్టుకోవాలి...నెలకోసారి చెయ్యి తెగ్గొట్టుకో వచ్చు. తలనొప్పి ఎంత జోరుగావచ్చినా పొద్దుట పదకొండులోగా పోయితీరాలి. పెద్ద పెద్ద ఖాయిలాలు అసలు వల్లకాదు. ఏడాదికి ఓసారి వచ్చినా 15 రోజుల్లో పోవాలి" అన్నాడాయన తలవంచుకుని ఏదో రాసుకుంటూ.

"అలాగేనండి, ఇవాళా రేపూ మాత్రం జ్వరం రానివ్వండి" అన్నాడు విశ్వం సెలవు తీసుకుంటూ.

* * *

శ్రావణమాసం, దానితోపాటు, విశ్వం వరలక్ష్మీవ్రతం పూర్తికొవచ్చాయి. పొరుగింటివారింట చారు ఘుమ ఘుమలాడినట్లు, పిన్ని కాచినచారు ఘుమ ఘుమలాడదని విశ్వం అనేకసార్లు ఢంకా మీద దెబ్బకొట్టినట్టు చెప్పాడు. ఓసారి కాస్త జరంవచ్చినపుడు, వాళ్లింట్లో చారుకావాలని కోరి తెప్పించుకుని సేవించి, మర్నాడు అనర్గళంగా ఆచారు రుచులను పొగిడాడు.

చెన్నాపట్టంనించిసూర్యనారాయణగారు వచ్చిన మర్నాటి ఉదయమే విశ్వేశ్వరరావు సూర్యనమస్కారాలు కూడా ప్రారంభించాడు.

పీఠరుగుమీద కూర్చొని దంతధావనం చేస్తున్న ఆ సూర్యనారాయణగారు, హఠాత్తుగా ఈ నమస్కారంచూసి హడలిపోయి లోపలికి పరుగెత్తాడు.

"ఔనే ఇలారా. వాళ్లబ్బాయి నాకు దండంపెట్టాడెందుకు?" అని అడిగేశాడు ఖచ్చితంగా.

"హాయ్యో రాత! రాయుచ్చుకు కొట్టినట్లు చెప్పొచ్చారే. ఆ పిల్లాడిసంగతి మీకేం తెలుసు? ఎంత ఒద్దికా...ఎంత వినయం... ఏంపంపనం. అలాంటి పిల్లాడు గర్భవాసాన పుట్టడానికి ఆ తల్లి ఏంనోచిందో" అంటూ ఆవిడ అదే ఇదిగా చెప్పుకుపోయింది.

* * *

జోగినాథం చాలా మెచ్చుకున్నాడు విశ్వం అదృష్టానికి. 'పంతులూ కథ ముగిసినట్టే. ఇంకేంలేదు చిన్న ఉద్యాపన ఉంది. అది కాస్తాచేస్తిమా, నీ నోము పండిందే. అయితే ఒక్క సంగతి..."

"ఫరవాలేదు. ఎంతో చెప్పు" అన్నాడు విశ్వం హుషారుగా.

"దావాదీనా తడిసి మోపెడవుతుంది కాని, పాతికలో సర్దేస్తాను."

"రైటో. ఉద్యాపన ఏమిటో చెప్పు."

జోగినాథం చెప్పాడు.

విశ్వం, ఏడిసినట్టుందన్నాడు.

జోగినాథం నీమొహం, నీకు తెలీదు అన్నాడు.

విశ్వం రైటో అన్నాడు.

ఉద్యాపనకి శ్రావణమాసం ఆఖరి శుక్రవారం సాయింత్రం ముహూర్తం పెట్టారు. లక్ష్మీవారం సాయంకాలం విశ్వం పెరట్లో పిట్టగోడకి చేరబడినించుని, పిన్నితో 'నేటి సమాజంలో సంస్కరణలు' అను విషయంపై విజ్ఞాన చర్చజరిపాడు. వరలక్ష్మమ్మగారు తులసిమొక్కకి పూజచేయడానికి రావడం చూసి, వరకట్నాలు ఎంతదారుణమో, కావాలనేవారు ఎంతరాక్షసులో ధాటీగా ఉపన్యసించాడు.

 

# వరలక్ష్మీ వ్రతం



'ఔరా ఏమిగొప్పహృదయం' అని ముక్కుమీదవేలేసుకు మరీ ఆశ్చర్యపడింది వరలక్ష్మమ్మగారు. గాయత్రి ముసిముసి నవ్వులునవ్వుతోన్నదల్లా పక్కనున్న ఇంట్లోకివెళ్లి పోయింది.

"ఇంకా పేళ్ళ నేనా" అనుకుని కంత శోషను ఉసూరుమంటూ, మేడమీదకి వెళ్లి పోయాడు విశ్వం. మర్నాడుసాయంత్రం మసకసంధ్యవేళ, పిన్ని వరలక్ష్మమ్మగారింటికివెళ్లి, తాంబూలం పుచ్చుకువచ్చింది.

వేసుకున్న పథకం అమలుజరుగడానికి ఏకునిముషాలుకూడా వ్యవధి లేనందువల్ల, విశ్వం పెరట్లో నే విహరిస్తున్నాడు.

"ఒరేయ్ విస్సీ ఇలారా." అంది పిన్ని వంటింట్లో పీటవేసి.

విశ్వం వెళ్లాడు.

"నామీద నీకు గౌరవముంటే చెప్పినట్లు విని, వాళ్ల గాయత్రిని చేసుకో" అంది.

విశ్వం నోరు తెరచి అట్టే కొయ్యబారి పోయాడు.

"వినకపోతే నీఖర్మం. లక్షణమైనపిల్ల, బుద్ధిమంతురాలు నేవళీకంఉంది. ఆయనా ఆవిడాకూడా నిన్ను చూచి ఎంతో ముచ్చట పడుతున్నారు. "అతనికి గిన్నాక ట్నం పుచ్చుకోకూడదని పట్టింపుఉంటే, అదేదో మరోవిధాన ముట్టచెబుతాం" అని బ్రతిమాలారు. ఇష్టమైతేచెప్పు. ఆయన రాత్రికి రైలుకి వెళ్లిపోతున్నారు. నువ్వు 'ఊ' అంటే తుళ్లీ రాగానే పెళ్లేనన్నారు. అన్నట్టు, అసలుసంగతి మర్చిపోయాను. అలాఉంది గాని, ఆపిల్లకి నువ్వంటే పంచప్రాణాలూనూ ఇందాక నాఎదటే, సిగ్గువిడిచి చెప్పిందికూడా. అలాటి లక్ష్మి నీకు వెయ్యి జన్మలెత్తినా దొరకదు. ఊ అనరాబాబూ" అందావిడ.

కొయ్యబారిన విశ్వేశ్వరరావు అతికష్టం మీద 'ఊ' అన్నాడు.

పిన్ని సంతోషంతో లేచి, పొరుగింటికి వెళ్ళబోయింది. ఎవరో వీధి తలుపుతట్టారు. 'వచ్చే వచ్చే!' అంటూ విశ్వంవంక చూచి ఆవడే వెళ్లింది తలుపుతీయడానికి.

అంతలోనే పెరట్లో చప్పుడైంది. 'కొంప మునిగింది. అయినా ఇంతలేటుగా చెబితే ఎలా. జోగినాథం ఉద్యాపన కొచ్చాడు కాబోలు' అన్నాడు విశ్వం గట్టిగానే. అంటూనే లేచి పెరట్లో కెళ్లాడు.

"అయ్యో! అయ్యో దొంగ దొంగ" అంటూ వరలక్ష్మమ్మగారు, ఆమెభర్త గాయత్రి పెరట్లోకొచ్చారు. విశ్వం చెంగున గోడదూకి అటు వెళ్లాడు.

పారిపోతున్న ఆదొంగ పెరటిగుమ్మం దగ్గర రాయితగిలి బోర్లగిలా పడ్డాడు.

'త్వరగా లేచిపో' అన్నాడు విశ్వం దొంగదగ్గరకెళ్లి. అంతలోనే వరలక్ష్మమ్మగారు, ఆమె భర్త వచ్చేయడంతో గుట్టు బయటపడుతుందని విశ్వం తెగించాడు. లేచి పారిపోబోతున్న జోగినాథం రెక్కపట్టుకుని లేపాడు.

"దొంగ వెధవా? ఎక్కడికి పోతావ్" అని గద్దించాడు చేతనయినంత కోపంగా.

"కనిష్టీపుల్ని? పిలుస్తా ఉండు" అన్నాడు సూర్యనారాయణగారు.

విశ్వానికి ప్రాణం పైనించి లేచిపోయింది. 'అబ్బెబ్బే వద్దండి మనవాడే... ఏమిాన్...మనమే చిదగ్గొట్టి పంపేద్దాం శుక్రవారం పూటా ఒకమానవుణ్ణి జైలుకు పంపటం ఎందుకు" అన్నాడు.

"ఆవెధవేం చేశాడో నీకు తెలుసా బాబూ మాలక్ష్మికి నేను వేసిన నెక్లెసు తీస్తున్నాడు. అంతలో నేను వచ్చి అట్టే అన్నాను. ఒక్కక్షణం ఆలస్యమయితే... ఇంకేమన్నా ఉందా"

"అంతే లెండి పిన్నిగారు_ఏమిాన్ అత్తయ్యా. అయినా వదిలేద్దాం పోలీసుల గోల మనకెందుకు. మనమే... నేనే తన్నేస్తా" అన్నాడు విశ్వం గంభీరంగా.

"వెధవని డొక్క వాలికట్టేసి మరీ వదలు బాబూ" అన్నారు సూర్యనారాయణగారు గోచీ బిగించుకుంటూ.

వ్రతం చెడ్డా ఫలందక్కాలి ఇప్పుడు వ్రతం ముగిసేలోగానే ఫలం దక్కింది. జోగినాథం దొంగతనం చేయబోవడం. తను అడ్డుపడి, ఆ 'దొంగ'ని తరిమివేసి అత్తగారి మెప్పులందుకోవడం ఈవ్రతానికి ఉద్యాపన. ఇప్పుడు గనక ఈఉద్యాపన చెడితే గుట్టు రట్టుఅవుతుంది. కథ చెడిసికొడుతుంది. ఫలం నిష్ఫలం అవుతుంది.

"జోగినాథం! నన్ను క్షమించు" అని మనసారా అనుకుని, చుట్టూ ఉన్నవారికి అనుమానం కలగకుండా ఉండగలందులకు గాను, అంతకన్న మనసారా జోగినాథం జుట్టు పట్టుకొని వీపుబద్దలయేలా బాదాడు విశ్వం. దెబ్బదెబ్బకీ ఐదూ పదీ, పదిహేను చొప్పున పరిహారం ఇచ్చుకుంటానని సాంకేతిక భాషలో చెబుతూనే వాస్తవికత ఉట్టిపడేటట్టు అభినయించడానికై, జోగినాథం చెంపలుకూడా వాయగొట్టాడు. 

## అసలు సంగతి

పెళ్ళిసంబంధం కుదిరింది. తాంబూలాలు పుచ్చుకున్న తరువాత, పెళ్ళికొడుకుతో, కాబోయే బావమరది కబుర్లు మొదలుపెట్టాడు.

"మీాకు ఉమర్ ఖయాం ఇష్టమేనా?" అన్నాడు.

పెళ్ళికొడుకు కాస్త ఆలోచించాడు. "నాకంత నచ్చదండి. జహంగీర్ పాద్షా అలీ మామూలుగా తింటాను. అయినా పేర్లు వేరుతప్ప అన్నీ ఒకటే" అని ఫెళ్లున నవ్వాడు.

ఇంటికి వెళ్ళిపోతున్నపుడు పెళ్లికొడుకు పెద్దన్నయ్య మందలించాడు. "వెధవా తెలీకపోతే తెలీదని చెప్పెయ్యరాదు. ఉమర్ ఖయం అంటే జిలేబీలాటి మిఠాయను కున్నావు కాబోలు. అది ఉత్తరాదివాళ్లు నిమ్మకాయ మసాలా వేసి చేసే బటాణీలతో చేసే వంటకాన్ని ఉమర్ ఖయ్యాం అంటారు."

డిటెక్టివ్ సీరియల్

# అపూర్వ హంతకులు

మూలం: ఎడ్గార్ వాలెస్    అనువాదం: ‘వినాయక’

## ‘బాకా’లో దురంతం

అప్పటికి పదిన్నర అయింది. మాన్‌ఫ్రెడ్ పాయ్‌కార్టు లిద్దరు గుర్రపుబండిలో పాటకచ్చేరినించి తిరిగి వచ్చేస్తున్నారు. బండి హానోవర్ స్క్వేర్‌గుండా అక్స్‌ఫర్డ్ వీధికేసి తిరిగింది. మాన్‌ఫ్రెడ్ పాయ్‌కార్టుకు చాలా జాగ్రత్తగా సలహా ఇస్తున్నాడు:

"మొట్టమొదట ఎడిటర్ని చూడాలని చెప్పు! సరే! నిన్ను వాళ్లాఫీసులోకి తీసుకుపోతారు. నీవ్యవహారం అక్కడి వారికి చెప్పు. అయితే అది తమవల్ల అయ్యేపనిగాదని వాళ్ళతిమర్యాదగా మాట్లాడుతారు. అంతే గాని నిన్ను వీధులోకి గెంటెయ్యరు కదా! నువ్వు ఎడిటరుగదిలోకి వెళ్ళే మిషమీద అటు ఇటు తిరుగుతూ చివరికి ఆగదిదగ్గరికి జేరుకుంటావు. ఆ ఎడిటరక్కడ లేకున్న సంగతి నువ్వెరుగుదువు. మెల్లిగా ఆ గదిలో దూరు! లోపల నీపని పూర్తిచేసుకో. ఇవతలికి రా! ఎవరూ అక్కడ లేకపోతే తలుపు బిగించు! నిన్నెవరయినా చూస్తే—గదిలో ఉన్నవారి దగ్గర సెలవు తీసుకున్నట్టు నటించు!"

పాయ్‌కార్ట్ చుట్ట కొన కొరికాడు.

"నీకవరుకు సుమారు గంటసేపటిదాకా ఆరని జిగు రంటించావంటే—వ్యవహారం మరీ మజాగా ఉంటుంది! తెలిసిందా! ఇంగ్లీషు డిటెక్టివు లిలాంటి కవరుచూస్తే గుండెలు బాదుకుంటారు."

బండి అక్స్‌ఫర్డు వీధిలోనించి ఆ పక్క రోడ్డుకి మళ్ళింది. మాన్‌ఫ్రెడ్ బండితలుపు తెరిచి, ‘మనమిక్కడ దిగుదాము’అన్నాడు. బండివాడు బండివీధికి ఒక్కపక్కగాఆపి, "మీరింకా చాలాదూరమే పోవాలన్నారు బాబూ!" అన్నాడు.

మాన్‌ఫ్రెడ్ బండి కిరాయి ఇచ్చివేసి "నిజమేగాని—నువ్వింక వెళ్ళిపో!" అన్నాడు.

బండి కనుచూపుమేర దాటిపోయేదాకా ఇద్దరు వీధిపక్కనే నిలబడి వాతాఖానీ వేశారు. తరవాత కొన్ని చిన్నవీధులు దాటి పికాడిల్లీ దగ్గరికి వచ్చారు. నాలుగడుగులు వేసి పక్కనేఉన్న హోటల్లో ప్రవేశించారు. పాలరాతి బల్లల దగ్గరగా కూర్చున్న జనంలో కొంతమంది సిగరెట్ కాలుస్తూ మాట్లాడుకొంటున్నారు. కొంతమంది పానీయాలు సేవిస్తున్నారు. గోన్సాలెజ్ ఆ పక్కనే ఒక బల్లదగ్గర కూర్చుని ఒక పొడుగాటి సిగరెట్ కాలుస్తున్నాడు. తీవ్రంగా ఏదో ఆలోచిస్తున్నాడు.

గోన్సాలెజ్ అక్కడ తటస్థపడ్డందుకు ఈయిద్దరు ఏమీ ఆశ్చర్యపడ్డట్టు కనబడలేదు! కాని మాన్‌ఫ్రెడ్ గుండె గతుక్కుమంది. వెలవెలబోయిన పాయ్‌కార్ట్ చెంపల్లో జేగురు రంగు పొడలు పొటమరించాయి!

అందరు ఒకచోటికి చేరారు. బల్లదగ్గిరికి వచ్చిన నౌకరుతో ఏవేవో కావాలని చెప్పారు. నౌకరు లోపలికి వెళ్ళిపోయాడు. మాన్‌ఫ్రెడ్ మెల్లిగా "థేరీ ఎక్కడ ఉన్నాడు?" అన్నాడు.

గోన్సాలెజ్ మెల్లిగా బుజా లెగరేశాడు. తరవాత చెక్కుచెదరకుండా—

థేరీ "ఉడాయించేశాడు!" అన్నాడు.

ఒక్క నిమిషంసేపు ఇద్దరు కిమన్నాస్తి. గోన్సాలెజ్ మళ్ళీ అందుకుని "మాన్‌ఫ్రెడ్! నువ్వు వీధిలోకి వెళ్ళేముందు థేరీకి పేపర్లేమైనా ఇచ్చావా?" అన్నాడు.

మాన్‌ఫ్రెడ్ ఔనని తల ఊపాడు:

"అవి ఇంగ్లీషు పేపర్లు. అయితే థేరీకి ఇంగ్లీషు అక్షరం ముక్క కూడా తెలియదు!

**జరిగిన కథ:-**

స్పెయిన్ దేశంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవం జరుగుతున్న రోజుల్లో విప్లవకారులు ఇంగ్లండులో మకాంవేశారు. వాళ్ళని వెళ్ళగొట్టడంకోసం ఆంగ్లదేశమంత్రి పార్లమెంటులో ఒక చట్టం ప్రవేశపెట్టాలని అనుకున్నాడు.

‘అపూర్వహంతకులు’ ఆ చట్టం ప్రవేశపెడితే చంపివేస్తామని బెదిరిస్తూ ఉత్తరం రాశారు. ‘బాకా’ఆ ఉత్తరం ప్రకటించడంతో ఊరూ వాడా గుప్పుమంది.

పార్లమెంటులో ఈ చట్టం ప్రవేశపెట్టే ముందు ఒకసభ్యునికి—పార్లమెంటు సభ్యులు చట్టం ఆమోదించకూడదని హెచ్చరిస్తూరాసిన బెదిరింపు ఉత్తరం అందింది.

తరవాత ‘అపూర్వ హంతకులు’ లిమిటెడ్ కంపెనీ పేర ఒక పెద్దభవనం అద్దెకు తీసుకుంటారు. దానిలో మాన్‌ఫ్రెడ్ గోన్సాలెజ్ లిద్దరు ఒక మారణపదార్థం తయారు చేస్తారు. పిమ్మట ‘బాకా’లో ఒక దురంతం జరిగింది. సంపాదకునికి కూడా ఒక బెదరింపు ఉత్తరం అందింది. ఆ తరవాత థేరీ ‘బాకా’ కార్యాలయంలో ప్రత్యక్షమైనాడు!

తెలివిగా చదువుతుంటాడు గదా! అని ఇచ్చాడు."

"వాటిల్లో 'టా కా' పేపర్లు కూడా ఉన్నాయా?"

"మాన్‌ఫ్రెడ్ వేలు కరుచుకుని ఆ విషయం గుర్తుకు తెచ్చుకుని "అవును సుమా!" అన్నాడు.

"అందులో ఆ బహుమతి, ఆ తమాషా మెలికైన తతంగం అంతా స్పానిష్ భాషలో అచ్చువేశారే!"

మాన్‌ఫ్రెడ్ బాగా పరధ్యానంలో పడి, "అవునవును! గుర్తొచ్చింది. నేను తరవాత అదంతా చదివాను కూడాను." అన్నాడు.

ఆ ప్రకటన ఎవరు రాశారోగాని, మహా తెలివిగా రాశారే!" అన్నాడు పాయ్‌కార్డు తల పంకిస్తూ.

"ధేరీ ఈ మధ్యన బాగా గాభరాగా ఉన్నాడని గ్రహించాను. అయితే నిన్న రాత్రే అతనితో రేమన్ పాత్ర వివరాలు - అతను చెయ్యవలసిన పని - అన్నీ చెప్పాను. ఆ కంగారు, గాభరా - అన్నీ దానివల్లే అనుకున్నాను." అన్నాడు మాన్‌ఫ్రెడ్.

ఇంతలో ఫలహారాల బంగితో నౌకరక్కడికి వచ్చాడు. గోన్సాలెజ్ అది కని పెట్టి సంభాషణ ఇంకో దారిని పట్టించాడు. అదే ధోరణిలోనే ఇలాగన్నాడు:

"ఆ గుర్రంమీద అంత పెద్ద పందెం పెట్ట దలిచినవ్వాడు - దాన్ని ఒక నెల రోజులు ముందే ఇంగ్లాండు పంపించి ఉండ వలసింది. దీనికోసమని అంత పెద్ద పందానికి నీళ్లు వదులుకోవడం ఏమీ బాగా లేదు."

తరవాత ఆ నౌకరక్కడినించి వెళ్లి పోయాడు.

గోన్సాలెజ్ మళ్ళీ తన పాత ధోరణిలో పడ్డాడు.

"ఈ వేళ సాయంత్రమే ధేరీ నేనూ కలిసి షికారుకి బయలుదేరాం. ధేరీ షాపులన్నీ పరీక్షగా చూస్తున్నాడు. తరవాత మేమిద్దరము ఒక ఫోటోగ్రాఫుల షాపు కేసి చూస్తూ నిలబడి పోయాం. చుట్టూరా వందలకొద్ది జనం ఉన్నారు. ఎక్కడికి వెళ్ళాడోగాని- చూస్తూండగానే ధేరీ మాయమైపోయాడు! ఎంత వెతికినా ఎక్కడా కనబడలేదు! అప్పటినించి వీధులన్నీ గాలిస్తూనే ఉన్నాను."

అని చెప్పి గోన్సాలెజ్ డ్రింక్ పూర్తి చేసి వాచీ చూశాడు.

ఇక ఆ మిగిలిన ఇద్దరు ఉలకా-పలకా లేరు.

ఇంకా జాగ్రత్తగా పరిశీలిస్తే-ఆ యిద్దరి చేతులు కోటు జేబులలో సరి చేశాయని చెప్పవచ్చును!

చిట్ట చివరికి గోన్సాలెజే అందుకుని "ఆఁ ఇంతకీ ఇందులో మునిగిపోయిందేమీ లేదులే!" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ.

మరికొంత సేపటికి మాన్‌ఫ్రెడ్—

"ఇందులో తప్పంతా నాదే!" అని ఇంకా ఏదో చెప్పబోయాడు.

ఇంతలో పాయ్‌కార్డ్ అతనికి అడ్డు తగిలి ఇలాగన్నాడు.

"ఇందులో తప్పేమున్నా ఉంటే నా పూచీ మాత్రం ఏమీ లేదు." అని ఒక్క చిన్న నవ్వు నవ్వాడు. తరవాత మాన్‌ఫ్రెడ్‌తో "ఇప్పుడింక తప్పెవరిదనుకుంటూ కూచుంటే లాభమేమిటి? మనం ఎవరము ఈ ధేరీ ఇంతటి జిత్తులమారి అని పసిగట్ట లేక పోయాం. ఇంగ్లీషు పేపర్ల చాకచక్యం కూడా మనకేమీ అంతుబట్టలేదు! ఆ పైన- అతను కన్నేసిన ఆ చిన్నదాని సంగతి కూడా మనం అంతగా పట్టించుకోలేదు." అని పూర్తి చేశాడు గోన్సాలెజ్.

అయిదు నిమిషాలు అలాగే గడిచి పోయాయి. అందరు తీవ్రంగా ఆలోచిస్తు న్నారు.

చివరికి గోన్సాలెజ్-"నాకో మోటారు కారుంది. అది బాగా అందుబాటులోనే ఉంది కూడాను" అన్నాడు.

"నీవు పదకొండు గంటలకే ఇక్కడికి వస్తానన్నావే! అవసరమయితే మనం తెల్లారే సరికి ఫ్రాన్సు వెళ్లిపోవచ్చును!...ఇంతకీ దీన్ని గురించి నువ్వేమంటావు?" అన్నాడు మాన్‌ఫ్రెడ్.

ఇక్కడే ఉండి దీని అంతేదో చూసి తీరాలి" అన్నాడు గోన్సాలెజ్.

"నేననేదే అదే!" అన్నాడు. పాయ్‌కార్డ్ ఏమీ తోచకుండా.

మాన్‌ఫ్రెడ్ నౌకర్ని పిలిచి "సాయంకాలం పేపర్లేమైనా ఉన్నాయా?" అని అడిగాడు.

నౌకరు లోపలికి పరిగెత్తుకు వెళ్ళి రెండు పేపర్లు పట్టుకొచ్చాడు.

మాన్‌ఫ్రెడ్ అవి జాగ్రత్తగా తిరగేసి, తరవాతఅవిఅక్కడ పడవేసి ఇలా చెప్పాడు: "అబ్బే! వీటిల్లో ఏమీ లేదు! ధేరీ పోలీసుల దగ్గిరికి వెళ్ళి ఉంటే-మనం కొంత కాలం పాటు ఎక్కడో దాక్కుని అందరం కూడ బలుక్కుని మళ్లీ కొత్తదారి తొక్కాలి. కాని ఇప్పుడే గట్టి దెబ్బ తీసెయ్యాలి! ధేరీ

మనకి కావలసిందంతా చెప్పేశాడుగదా!- కాని-"

షాయ్‌కార్ట్ ఆ మాటకి అడ్డంవచ్చి- "అయితే మనం మంత్రికిచ్చినమాట తప్పడం న్యాయంకాదు! అతనికింకా రెండు రోజుల గడువిచ్చాం. ఈ గడువు ముగిసేలోగా ముందొక హెచ్చరిక చెయ్యాలి.! ఆ తర వాత ఆఖరుది" అన్నాడు. "అయితే మనం ఎల్లాగైనా థేరీని పట్టుకోవాలి." ఈ మాట అంటూనే మాన్‌ఫ్రెడ్ లేచాడు. తరవాత మిగిలిన ఇద్దరు కూడా లేచారు.

"థేరీ పోలీసుల దగ్గరికి వెళ్లి ఉండకపోతే ఇంకెక్కడికి వెడతాడు?"

అన్నాడు గోన్సాలెజ్. అతని ప్రశ్న లోనే ప్రత్యుత్తరం సూచనగా తోచింది. మాన్‌ఫ్రెడ్ వెంటనే-"స్పానిష్ భాషలో ప్రకటన వేసిన పత్రిక ఆఫీసుకివెళ్ళి ఉండాలి" అన్నాడు.

చివరికి ముగ్గురు అమాంతంగా అదే జరిగి ఉండాలని నిశ్చయించేశారు. ఎనీమోటారు కారిప్పుడు బాగా ఉపయోగిస్తుంది." అన్నాడు మాన్‌ఫ్రెడ్. వెంటనే ముగ్గురు గదిలోనించి ఇవతలికి వచ్చారు.

* * *

అది 'బాకా' కార్యాలయంలో ఎడిటరు గది థేరీ కెదురుగా ఇద్దరు పత్రికా రచయితలు కూచుని అతని మీద ప్రశ్న వర్షం కురిపిస్తున్నారు.

వెల్బ: 'నీ పేరు థేరే ఆ! ఆ పేరెక్కడా విన్నట్టు లేదే! ఎక్కడ నించి వచ్చావు! నీ చిరునామా?" "మాది స్పెయిన్‌లో దక్షిణాది ప్రాంతం. నేనక్కడ ద్రాక్షతోటలో పనిచేసేవాణ్ణి—" వెల్బ అతని మాటకడ్డుపడి "నే నడిగిందది కాదు. ప్రస్తుతం లండన్‌లో ఏ ప్రాంతంనించి వచ్చావని!"

థేరీ దేనికి ఏమని చెప్పడానికీ పాలుపోక కంగారుగా ఇలాగన్నాడు :

"నాకేం తెలుస్తుంది! ఇక్కడ అన్నీ వీధులే! అన్నీ ఇళ్లే! ఎక్కడ చూసినా జనమే! ఈ మహానగరంలో నేనొక మనిషిని చంపాలి! ఆయనగారొక మంత్రి! ఆ మంత్రి ఏదో భయంకరచట్టం ఒకటి పార్లమెంటులో ప్రవేశ పెడుతున్నాట్ట! వాళ్ళా వివరాలేవీ నాతో చెప్పలేదు!

"వాళ్లంటే?" అన్నాడు ఎడిటరుఎంతో ఆత్రంగా. "మిగిలిన ముగ్గురూనూ". "వాళ్ళ పేర్లు?" థేరీ ఎడిటరుకేసి అనుమానంగా చూసి, దిగులుగా ఇల్లాగన్నాడు.

"దీనిలో బహుమతీ క్షమాపణ-ఉన్నాయి ఈ రెండిటికీ హామీ ఉంటుందంటే నే చెప్పేదేదో చెబుదామని"—

సంపాదకుడు ఒక్క అంగలో బల్లమీదికి వంగి—"నీవా నలుగురిలో మనిషివయితే తప్పకుండా బహుమతీ దక్కుతుంది. ఆ ప్రతిఫలం కొంత నీ కిప్పుడే ముట్టుతుంది కూడాను." అంటూనే బెల్ కొట్టాడు. నౌకరక్కడ హాజరయ్యాడు.

"వెంటనే కంపోజిటర్ల గదిలోకివెళ్ళి, నేను చెప్పేదాకా వాళ్లెవళ్లనీ అక్కడి నించి కదలవద్దని చెప్పు!" అన్నాడు సంపాదకుడు.

కింద అచ్చుయంత్రాలు పొద్దుటి తాజా వార్తల సంచికలతో హోరుమని మోతెత్తిపోతున్నాయి.

ఎడిటరా తరవాత హఠాత్తుగా థేరీకేసి తిరిగి— "ఇప్పుడు నీకు తెలిసిందంతా చెప్పు!" అన్నాడు.

థేరీ మాట్లాడలేదు. ఊరికే నేలకేసి చూస్తున్నాడు.

"బహుమతీ — క్షమాపణా — రెండూ దక్కుతాయి! కానీ!" అన్నాడు ఎడిటర్ నిక్కచ్చిగా.

"త్వరగా చెప్పాలి! బహుమతీ—క్షమాపణ రెండు ఒక్కసారిగా ఒళ్లోపడతాయి! ఆ నలుగురు న్యాయసంరక్షకులు అంటే ఎవరు?—మరి ఆ మిగిలిన ముగ్గురు ఎవరు! వాళ్లెక్కడ ఉన్నారు!"

"ఇక్కడ!" అన్నమాట ఒకటి వెల్బ వెనకాల స్పష్టంగా వినబడింది! వెల్బ వెనక్కి తిరిగిచూశాడు! వెనకనించి ఒక కొత్త మనిషి లోపలికి వస్తూనే—వచ్చిన ద్వారం మూసేశాడు! తరవాతగదిలోఉన్న ముగ్గురికీ ఎదురుగా నిలబడ్డాడు! ఒళ్లంతా నల్లటి ముసుగు! అతని బుజం కిందుగా ఒక రివాల్వర్!

ఆ ముసుగు మనిషి నదురు బెదురు లేకుండా "వారిలో నే నొకణ్ణి. ఇక మిగిలిన ఇద్దరు వీథిలో రెడీగా ఉన్నారు" అన్నాడు.

ఎడిటరు "ఇక్కడికెలావచ్చావు! ఏం కావాలి?" అన్నాడు.

వెంటనే ఎడిటరు చెయ్యి డ్రాయరు తియ్యబోయింది. ముసుగు మనిషి రివాల్వర్ గురిపెట్టి గట్టిగా ఉరిమాడు :

"ఆ చెయ్యి తీసెయ్! నే నిక్కడికెలా వచ్చానో వీధిగుమ్మందగ్గిర మనిషి చెబుతాడు-మళ్ళీ తెలివి వస్తే గిస్తే మాట! నే నిక్కడికి ఎందుకు వచ్చానా? నా ప్రాణాలు దక్కించుకోడానికి! ఇందులో విడ్డూరమేమీ లేదు! మరి థేరీ పెదిమలు కదిపాడంటే - నా పని అయిపోయిందన్నమాటే! అతన్ని అడ్డడానికే ఈ ప్రయత్నం అంతాను! నాకు మీ ఇద్దరితోను, లావాదేవీ లేవీ లేవు! కాని - నా పని కడ్డుతగిలితే మాత్రం మీరిద్దరు హతమయిపోతారు!"

ఇంతవరకు ఆ ముసుగు మనిషి ఇంగ్లీషులోనే మాట్లాడాడు! థేరీ తెల్లబోయి కళ్ళు మిగించి, గోడకి చేర్లబడ్డాడు. ఊసరవెల్లిలా ఊపిరి విడిచిపెడుతున్నాడు!

ముసుగుమనిషి బిక్కచచ్చిపోయి గోడకి ఆర్లబడిన థేరీకేసి తిరిగి, స్పానిష్ భాషలో జేల్లా బెదిరించాడు:

"ను వ్విపాటికి నీ కామ్రేడుల గొంతుకలు కోసేసిఉందువు! మన ఆదర్శం అంతా ఈపాటికి మంటగలిసిపోయిఉండును! కనక నిన్నిప్పుడు చంపివెయ్యడమే న్యాయం!"

అని ఆ నూతన వ్యక్తి రివాల్వర్ థేరీ గుండె మీదికి గురిపెట్టాడు.

థేరీ నోటికి వచ్చిన ప్రార్థన ఏదో గబగబా పణుకుతూ ఒక్కసారిగా నేలమీద మోకరిల్లాడు!

సంపాదకుడు లేచి నుంచుని "అయ్యో! అయ్యో! వద్దు! చంపవద్దు!" అని అరిచాడు. రివాల్వర్ వెంటనే ఎడిటర్ వైపు తిరిగింది. ముసుగుమనిషి గొంతు బాగా తగ్గించి—

"ఇదిగో! మీరు తప్పనిసరిగా నాచేత హత్యం చేయించేస్తున్నారు!" అన్నాడు.

ఎడిటరొక్కసారిగా ముందుకురికి ఒళ్లెర

# ★ అపూర్వ హంతకులు ★

గది కోపంలో "నువ్వీ హత్యచెయ్యడానికి వీల్లేదు!" అన్నాడు.

వెల్చ్ అతని జెబ్బ పట్టుకుని తమాయింప జేసి,-"ఊరికే తొందరపడితే లాభమేమిటీ? అతగాడు చెప్పినంత చేసితీరతాడు. ఇప్పుడిక మనం చేసేది ఏమీ లేదు!" అన్నాడు.

ఆగంతుకుడు రివాల్వర్ జారవిడిచి, "తేకేం కొంచెం ఉంది!" అన్నాడు.

సంపాదకుడామాటకు సమాధానం ఇచ్చేలోగా గది తలుపెవరో తట్టారు!

థేరే మూల కూలబడి మూలుగుతున్నాడు. ముసుగు మనిషి థేరీ వైపు రివాల్వర్ తిప్పుతూ" ఇప్పుడు చాలా తొందర పనిలో ఉన్నానని చెప్పవయ్యా!" అన్నాడు ఎడిటర్తో. అతడు వెంటనే "ఎవరా తలుపు దగ్గర! ఇప్పుడు మాటాడడానికి వీలులేదు పో!" అన్నాడు.

"కంపోజిటరులంతా కనిపెట్టుకుని కూచున్నారు బాబూ!" అన్నాడా తలుపవతలి ఆసామీ. తరవాత అతడు వెళ్లిపోతున్న చప్పుడు వినబడింది.

అటు పిమ్మట ఎడిటరు ముసుగు మనిషి కేసి తిరిగిఅయితేమే మిప్పుడిక చెయ్యగలిగిందేమిటి?"అన్నాడు.

"థేరీ ప్రాణం రక్షించవచ్చును."

"ఏలాగ?"

మిమ్మల్నిద్దరినీ వెళ్ళిపోనిస్తానని మాట ఇస్తే చాలు! మరి తరవాత గోలచెయ్యకూడదు! పావుగంటదాకా గదిలోనుంచి బైటికి రాకూడదు!"

సంపాదకుడు కొంచెం తటపటాయిస్తూ-

"ఇక్కడనించి వెళ్ళిన తరువాత నీవిప్పుడు తలపెట్టిన హత్య మరి జరగదని నమ్మకమేముంది?" అన్నాడు.

ముసుగుమనిషి ఫక్కున నవ్వి—

"నేనీ గది దాటగానే మీరు గోల చెయ్యరని మాత్రం నమ్మకమేమిటి?" అన్నాడు.

"నామాట ఖరారే!" అన్నాడు సంపాదకుడతి గంభీరంగా.

"నామాట అంతకన్నా ఖరారు! నేనెప్పుడు అన్నమాట తప్పలేదు!"

సంపాదకుని హృదయంలో పెద్ద మథన ప్రారంభమయింది. పంద ఏళ్ళ ఈలోపుగా ఇలాంటిహుషారైనవ్యవహారం ఎప్పుడుతటస్థపడలేదు. ఒక్క నిమిషం ఆలస్యమైతే థేరీ దగ్గిరనించి అపూర్వ హంతకుల కథ అంతా లాగేసి ఉండును!

ఇప్పుడైనా గుండె నిబ్బరంతో ముందుకురికితే పని జరిగిపోతుంది. కంపోజిటర్లంతా కనిపెట్టుకుని కూచున్నారు! కాని ఆ ముసుగు మనిషి రివాల్వర్ గురిపెట్టి ససేమిరా వల్లకాదంటున్నాడు! ఎడిటెరుకింక లొంగిపోవడం తప్ప గత్యంతరం కనబడలేదు!

"ఇది నాకేమీ ఇష్టంలేదు! కాని దీనికి నేనంగీకరిస్తున్నాను. అయితే - నీ అరెస్టు - ఆపైన శిక్ష-ఇవి రెండూమాత్రం ఖాయం!"

ముసుగు మనిషి మర్యాదగా కొంచెం తలవంచి, - "ఈ విషయంలో మీతో ఏకీభవించలేక పోయినందుకు నాకు చాలా ఇదిగా ఉంది! ఒక్క చావుతప్ప తప్పకుండా జరిగేదేదీ కనబడదు!" అన్నాడు

తరవాత స్పానిష్ భాషలో మాటాడుతూ—

"రా! థేరీ! నీకేమీ భయం లేదులే! నేను మాట తప్పను!" అన్నాడు.

థేరి తలవంచుకుని నేలకేసి చూస్తూ అలాగే ముందుకు నడిచిపోతున్నాడు.

ముసుగు మనిషి తలుపు ఒక అంగుళం వరకే తెరిచాడు. థేరి అతని వెంట పడ్డాడు. అంతలో ఎడిటర్ బుర్రలో జీవితానికల్లా ఒకే ఒక్కసారి అత్యద్భుతమైన ఆలోచన తట్టింది! వెంటనే అది వెళ్లగక్కాడు:

"అన్నట్టు ఒక్క మాట! ఇంటికి వెళ్ళగానే మిమ్మల్ని గురించి మాంచి మజా అయిన వ్యాసం రాసి పంపించాలి! అంతగా ఇబ్బందికరమైన చిన్న చిన్న వివరాలేవీ రాయనక్కర్లేదు తెలిసిందా!-అందులో మీ లక్ష్యాలు, మీ రీపని తలపెట్టడానికిగల కారణాలు-మొదలైనవన్నీ ఉండాలి. తెలిసిందా?"

ముసుగుమనిషి ఎడిటర్నెంతో మెచ్చుకుంటూ—

"ఇలాంటి వ్యవహారంలో మీది అందెవేసిన చెయ్యి!.. సందేహం లేదు! ఆ వ్యాసం తెల్లారేసరికి 'మీ బల్లమీద వాలిపోతుంది!" అన్నాడు! తరవాత తలుపు తెరిచి ఆ ఇద్దరు ఒక చీకటి బాటలో అదృశ్య మయ్యారు!

—ఇంకా ఉంది.

## 'ఎక్కడనుండి?'

అప్పారావు: (టెలిఫోనులో) ఓయ్ సుబ్బారావు. నేను చచ్చిపోయానని పత్రికలలో వార్త పడిందట చూశావా?

సుబ్బారావు: ఆ.ఆ. మరే నువ్విప్పుడెక్కడనించి మాట్లాడుతున్నావు?

# చిత్రమాలిక

## పంతులు—శాస్త్రి

స్నేహలత

రిజిస్ట్రేషను వ్యవహారం రెండు గంటలకే అయిపోయింది. బజారుపని నాలుగన్నర కల్లా పూర్తయి పోయింది. ఆరు గంటలకి గాని రైలు లేదు. మాధవరావు తనతో కూడా వచ్చిన సరవయ్యకి సామానులు అప్పజెప్పి స్టేషనుకే వెళ్ళి కూర్చోమన్నాడు. తాను సరిగా రైలువేళకల్లా వస్తానన్నాడు.

సరవయ్యని పంపించిన తరువాత కొంచెం సేపు అటూ ఇటూ తిరిగి మరొక్క కప్పు కాఫీ తాగి వస్తే సరిగా వేళకి వెళ్ళినట్లే అనుకున్నాడు. అన్న సమయానికి అరగంట ఆలస్యంగా వెళ్లడం మర్యాద కాదు గాని, ఒక అరగంట ముందుగా వెళ్ళడంలో పొరపాటేముంది? కాకపోతే ఆ ప్రాంతంలోనే కొంచెం సేపు తచ్చాడవచ్చును.

రెండు గంటలకి బరువుగా టిఫిను తినడం చేత ఏమీ ఎక్కువగా తినాలనిపించలేదు. అయినా కేవలం కాఫీ తాగి బైట పడడానికి ఇష్టపడక ఒక దోశ తిని కాఫీ తాగేడు.

కాఫీ హోటలులో ఫలహారాలు బాగానే ఉన్నాయి. గాని, అద్దాలు అంతకన్నా బాగున్నాయి. అందులో ఈవాళ వాటి ఉపయోగం మాధవరావుకి మరీ బాగా మనసుకి నాటింది

తనను తాను కొత్తగా ఎవరో మనిషిని చూసినట్లుగా చూసుకుని పరవాలేదనుకొన్నాడు. భగవంతుడిచ్చిన కను ముక్కు తీరు ఉండనే ఉంది. దానికి తోడు చక్కగా సంరక్షణచేసి పెంచి, నాగరికంగా కత్తిరింపించుకున్న క్రాఫింగు ఉంది. బంగారపు ఫ్రేము కళ్ళజోడు ఉంది.

కుర్చీలోంచి లేచి నిలబడినప్పుడు పూర్తిగా మనిషి అంతా కనబడ్డాడు. తను అయిదడుగుల పదంగుళాలు పొడుగున్నా అంత మరీ సన్నంగా లేడు. తన తెల్ల పేంటు తెల్లచొక్కా—వాటిలో ఎంచడానికేమీ లేదు.

కాఫీ హోటల్లోంచి బైట పడి సిగరెట్టు వెట్టి, రెండుమిఠాకిల్లీలు తీసుకున్నాడు. కిల్లీ దుకాణం ముందున్న అద్దం ఇందాకటి తన అభిప్రాయాన్ని బలపరిచింది.

నడిచి వెళ్ళడమా రిక్షాలో వెళ్ళడమా? అనుమానం వచ్చింది. నడిచి వెళ్తే కొంత టైము కలిసి వస్తుంది. (అంటే ఇప్పుడు తాను కొంత కాలం గడపవలసి ఉంది కదా) అయినా సుమారు రెండు మైళ్ళు ఉంటుంది. తమ పల్లెటూళ్ల లెక్కనైతే ఆ మాత్రం దూరంలో రెండు మూడు ఊళ్ళను దాటి పోవచ్చును. చివరికి రిక్షా ఎక్కడానికే నిశ్చయించుకొన్నాడు. కాకపోతే అక్కడ ఆ వీధిచివరను దిగిపోయి తాపీగా వెళ్లవచ్చును అనుకొన్నాడు.

రిక్షాలో కూర్చున్నాడు. వెనక్కి చేరగిలబడి తన్మయత్వంతో సిగరెట్టు పొగని అనుభవిస్తున్నాడు.

తన అభిమానపత్రికలో తరుచు రాసే అభిమాన రచయిత్రి అనూరాధాదేవి గారిని కలుసుకోబోతున్నాడు. అది విశేషం. చాలామంది లాగ "ఎవరో ఈ అనూరాధ? బాగానే రాస్తున్నట్టుంది" అనేసి ఊరుకోక పత్రిక ఆఫీసునుండి ఎడ్రసు సంపాదించాడు. ఆ ఉత్తరం వచ్చి నాలుగు రోజులే అయింది.

అసలు ఎడ్రసు తెప్పించడంలో ఉద్దేశం కేవలం ప్రశంసాత్మకంగా ఒక ఉత్తరం రాద్దామనే—అయితే అదృష్టవశాత్తూ ఆవిడ ఉండడం తమ ఊరికి పది మైళ్ళ దూరంలోనే గల పట్నంలోనే తటస్థించింది. అందుకు తోడు ఈరిజిస్ట్రేషన్ వ్యవహారం ఒకటి వేళకు కలిసివచ్చింది. దాంతో ముఖాముఖిగా కలిసి మాట్లాడ్డం చాలా బాగుంటుందన్న నిశ్చయానికి వచ్చిన వాడయి, మొన్న ఈ వూరువస్తున్న సుబ్బారాయుడు చేతికి ఉత్తరం ఇచ్చి ఇక్కడే పోస్టులో పడెయ్యమన్నాడు. తమ ఊరి నుండి అయితే ఉత్తరం అందడం ఆలస్యం కావచ్చును. తరవాత ఆ రాత్రే సుబ్బారాయుడు ఏమరిక లేకుండా ఉత్తరం పోస్టు చేసిన వైనాన్ని తెలుసుకొని మరీ నిద్రపోయాడు. అందుచేత ఉత్తరం నిశ్చయంగా అంది ఉంటుందనడంలో ఎటువంటి సందేహమూ లేదు.

ఈ రిజిస్ట్రేషన్ గొడవ ఎంతసేపు పడుతుందో అన్న అనుమానంతో అయిదు గంటలకు వచ్చి కలుసుకొంటానని రాసేడు—ఇంత వేగం తెమిలిపోతుందని తెలిసివుంటే ఏ మూడుగంటలకో వస్తానని రాసిఉండును—సరే, కానీ ఇప్పుడు మరి చేసేదేముంది? అయిదు దగ్గరనా కావస్తుంది—

అనుకొన్న ప్రకారంగా వీధిచివర రిక్షా దిగిపోయి ఇంకొక సిగరెట్టు ముట్టించాడు. ఇంకా రిక్షాలోనే వెళ్లాలన్నా ప్రయోజనం లేదు. అసలు ఇల్లేదో తనకి తెలుస్తేకద్తూ? ఇంకా నయం, పత్రికవాళ్ళు ఫలానా ఊరు అని రాస్తే ఉత్తరం అందిపోతుందని రాయలేదు. అలా అయినా తను హంతకుడు కొనక్కరలేదు. పోస్టాఫీసుకివెళ్ళి కనుక్కుంటే తెలిసిపోతుంది. ఇప్పుడంత గొడవ లేదు—వీధిలో అనుమానం లేదు—ఈవీధో, ఎంతమహో, ఒక ఫర్లాంగుకంటె పొడవుగా లేదు. ఇందులో అటువంటి పేరుపడ్డవ్యక్తినివాసం కనుక్కోడం ఏమంత కష్టమయిన పని?

అసలు తన ఉత్తరం ఆమెకి తప్పకుండా అందేఉంటుంది. అంచేత తప్పకుండా తనకోసం ఎదురుచూస్తూ వుండాలి

అలా వీధికి అటూ ఇటూ గల ఇళ్ళను పరిశీలించుకొంటూ వీధి ఈ చివరినుండి ఆ చివరివరకూ సాగిపోయాడు. అట్టే జన సంచారం ఉన్న వీధిలా లేదు—ఎక్కడా తాను ఇకే అయి వుంటుందనుకొందికి తగిన

ఇల్లు కనిపించలేదు—పోనీ ఎవరినయినా అడుగుతామా అనుకొంటే, అడిగితే సరైన జవాబు వస్తుందనిపించే మొగం ఏదీ కనిపించలేదు. ఎవరినో ఒకరిని అడక్క తప్పదు—మళ్ళీ తను ఆరుగంటలకి స్టేషనుకి వెళ్ళాలి. ఇప్పుడు రైలు తప్పిపోయినందువల్ల మరేం ప్రమాదంలేదు. రాత్రి రెండవ ఆట సినీమా చూసి, తెల్లవారుజామురైలుబండికి వెళ్ళవచ్చును—అయినా, అనవసరంగా రైలు తప్పిపోవడందేనికి? చూడదగినవిగా లేవు ఉన్న మూడు సినీమాలున్నూ—

మాధవరావుకి కొంచెం విసుగుదల కలిగింది. ఇంత పెద్ద తెలుగుదేశంలో ఉన్న మనిషినిగూర్చి ఏ ఊరో ఏ వీధో తాను తెలుసుకోగలిగాడు గాని, వీధిలో ఇల్లెక్కడో తెలుసుకోలేక పోవడం ఏమిటి? మరి మొగమాటపడి లాభంలేదు—ఇదుగో ఈ ఎదురుగా వస్తున్న గొడుగు, కోటు ఆయన్ని అడగాలి.

ఇంతా చేసి తాను మనిషిని ఎంచుకొని అడిగితే ఆ మనిషిది ఈ ఊరే కాదట! ఎవరో బంధువుల ఇంటికి వచ్చి ఇప్పుడు రైలుకి వెళ్తున్నాడట. అతను పోతూ పోతూ అయాచితంగా ఒక సలహా కూడా పారేశాడు—"ఈ వీధిలో ఉంటున్న వాళ్ళ నెవళ్ళనయినా అడగండి — తెలుస్తుంది" ఆయన అడక్కుండా సలహా ఇచ్చినందుకు కోపం వచ్చినా చివరికి అదే ఆచరణీయ మనిపించింది.

వీధిలో మళ్ళీ సంచారం ప్రారంభించాడు. వీధిలోని ఇళ్ళు సుమారు అన్నీ వీధికి ఆనుకొనే ఉన్నాయి. ఒక ఇంటికి మాత్రం ముందు గోడ ఉంది; గేటు ఉంది-పక్కగా చిన్న అరుగులున్నాయి. ఒక అరుగుమీదకొక కాలు మోపి, నిలబడి ఉన్నాడొకతను. ముతక ఖద్దరు లుంగీ, గళ్ళ చొక్కా—బీడీ కాలుస్తున్నాడు—అతను ఇందాకా తాను ఇటునించి వెళ్ళినప్పుడూ అలాగే నిలబడి ఉన్నాడు; కాకపోతే అప్పటి బీడీ పారేసి ఇంకొకటి ముట్టించి ఉంటాడు—అతనిని ఎందుకో అడగాలని బుద్ధి పుట్టలేదు ఇందాకా—కాని, ఇప్పుడు మరి తప్పేలాగ లేదు, ఏమంటే, ఇందాకా అతను సలహా చెప్పినట్టు ఈ మనిషి ఈ వీధిలో ఉంటున్నవాడే, కాక, ఏమీ పనిలేకుండా అలా నిలబడి ఉన్న మనిషికి కాస్త పని కల్పించినట్టూ అవుతుంది. దగ్గరకు వెళ్ళి వివరాలన్నీ చెప్పి ప్రశ్నించాడు—

అతను అడిగిన దానికి సమాధానం చెప్పకుండా, "ఎందుకు ఆవిణ్ణి కలుసుకోవడం? ఆవిడ మీకేమయినా డబ్బు బాకీ ఉందా?" అని అడిగాడు.

మాధవరావుకి ఈ మనిషి ధోరణి ఏమీ నచ్చలేదు—కాని, ఇతనికేదో ఆవిడ గురించి తెలిసినట్టే ఉంది—అధమం ఆవిడ ఎక్కడుంటుందో అయినా తప్పక చెప్పగలడనుకొన్నాడు—తనరాక ఉద్దేశం ఏమిటో విశదపరచాడు.

అతను "అలాగా! అయితే రండి, ఆవిడ ఈ ఇంట్లోనే ఒక భాగంలో ఉంటున్నారు! మేమొక భాగంలో ఉంటున్నాము—లోపలికి రండి" అన్నాడు.

మాధవరావు సరైన మనిషిని పట్టుకొన్నందుకు తనని తాను అభినందించుకొంటూ ఆవిడతో సంభాషణకి ఎలా ఉపక్రమించడమా అనుకొంటూ అతని వెనకాతలే లోపలికి వెళ్ళేడు.

కాని అంతలోనే ఆశాభంగంగా అతను, "అరె, తాళం వేసి ఉంది! నేనింకా ఆవిడ ఉన్నారనుకొన్నాను. కూర్చోండి" అన్నాడు కుర్చీ చూపిస్తూ—

మాధవరావుకి మరి కూర్చోడానికి బుద్ధి పుట్టలేదు. "ఎందుకులెండి, నాకు అవతల రైలుకి వెళ్ళవలసి ఉంది. మరోకప్పుడు, తీరికగా ఉన్నప్పుడు వచ్చి కలుసుకొంటాను-ఇల్లు తెలిసిందికదా, నమస్కారం!" అన్నాడు.

అతను అంత సులభంగా విడిచి పెట్టలేదు మాధవరావుని. "ఇంత వచ్చి ఆవిణ్ణి చూడకుండా వెళ్ళిపోతారా? మీరూ వెళ్ళిపోగానే ఆవిడ వస్తారేమో? ఇంతకీ మీరు టైము కూడా తెలుపుడు చేస్తూ ఉత్తరం రాసేరేమో? ఉండండి, పెరట్లో ఉంది మా చెల్లెలు లలిత-దానితో ఆవిడ ఏమయినా చెప్పిందేమో?"

మాధవరావుకి కూర్చోక తప్పిందికాదు-ఆ అమ్మాయి పెరట్లోంచే పాడుకొంటూ వచ్చి, మాధవరావుని చూసి పాట ఆపేసింది. అతను "చెల్లెమ్మా! మన ఈ రెండో వాటాలో ఉన్న అనూరాధగారిని కలుసుకొందికి ఈయన వచ్చేరు. సరిగా అయిదు గంటల వేళకి వస్తానని కూడా ముందుగా తెలియ పరచారట-అయినా చూడు ఆవిడ ఎక్కడికి వెళ్ళిపోయిందో ఏమిటో, నీతో ఏమైనా చెప్పిందా?

"చెప్పడం అంటే ఉదయం కాఫీ తాగుతున్నప్పుడు అంది. ఈవాళ సాయంకాలం తను ఇంటిదగ్గరే ఉంటాననీ, ఎవరినో కలుసుకో వలసి ఉంటుందని. బహుశః వీరినే అయిఉంటుంది—కాని, ఎక్కడికి వెళ్ళిపోయిందో?"

"అసలు ఎక్కడికి వెళ్తుందో ఏమిటి చేస్తుందో, ఆవిడకి తెలుస్తే కదూ"

"అదీనిజమేన్నే, తననుతానే మరిచిపోతూ ఉంటుంది. ఒకొక్కొక్కనాడు ఏదో రాస్తూ కూర్చొని, తిండిమాటకూడా మరిచిపోతుంది. తరవాత చల్లారిపోయిన అన్నం తినలేక బాధపడుతుంది—"

"ఆఁ ఏమిటో సెద్దూ! అంతమహోదీక్షగా రాసేస్తున్నట్టు - అదీ ఒకపోజే"

"పోజు కానీ, ఏం కానీ, ఆవిడ కథలు రాస్తుంది; వాటివిలువ వాటికుంది. లోకంలో కొందరి దృష్టిలో అవే కళా స్వరూపానికి పరమావధులు—"

"ఆఁ పోనిద్దూ! ఏదో ఆడది రాసిందికదా అని పత్రికవాళ్లు వేసుంటారు—కాక, ఆ కథల్లో ఉన్న విశేషం ఏమిటో నాకేమీ బోధపడదు. ఎందుకిలా జనం వెర్రెత్తిపోతున్నారో? అంతే వేలంవెర్రి అంతికంటే మన అమ్మమ్మ చెపూఉండే "గాజు గంబాల మేడ" కథ ఎంతో బాగుంటేది."

అమ్మమ్మ కథలంటావు. ఆవిడ అమ్మమ్మ కథలు రాసినా ప్రజలకి బాగానే ఉన్న

"నమస్కారం స్వామీ. క్షేమమా..ఒక రూపాయుంటే అప్పివ్వండి."
"రూపాయి.. జేబులో రాగి దమ్మిడీకూడా లేదు!"
"ఓ. అలాగా.....పోనీ ఇంట్లో..."
"ఇంట్లోనా. ఓ. అంతా కులాసాగా ఉన్నారండి మీ దయవల్ల. అంతా క్షేమం. వస్తా."

టుంది. ఆకుత్యాయు రాసిన, "దైవసంకల్పం" కథమామూలుగా అందరూ చెప్పుకొనే కథే కదా! దాన్లో ఉన్న విశేషం ఏమిటని చూశాను మేటర్న్ళకుంతలనీ కాంతనీ వాళ్లనీఅడిగేను—రామాయణ భారత కథలు తెలిసినవే అయినా రాసినవాళ్ల ప్రతిభనిబట్టి మళ్ళీ మళ్లీ చదవా లనిపిస్తున్నట్టే తెలిసిన కథే అయినా బాగా రాయగలిగినవాళ్లు రాస్తే గొప్పతనం వచ్చేస్తుందిట."

"బాగానే ఉంది. అంటే ఇదొక పిచ్చి-లోకం గతానుగతికం అని ఊరికినే అన్నారా!"

తాను ఉన్నాడన్న స్ఫురణే లేకుండా అన్నాచెల్లెళ్లు సాగించే ఈ సంభాషణ చాలా అరుచికరంగా తోచింది మాధవరావుకి. ఒకటి రెండుమార్లు లేచిపోవాలనుకొన్నాడు. కాని, వాళ్లధోరణి, ముఖ్యంగా ఆవిడ కథలనగూర్చి ఉన్న తప్పుడు అభిప్రాయాలను సరిదిద్దకుండా ఎలా వెళ్లి పోగల ననుకొన్నాడు. తానూ కలుసుజేసుకున్నాడు సంభాషణలో—ఏదో మూక ఉమ్మడిగా "ఈకథల్లో ఏముందనీ, నాకేమీ ఇష్టపడ లేదనీ" అంటే లాభం లేదన్నాడు. విమర్శన అనేది ఎలా ఉండాలో వివరించాడు ఉపోద్ఘాతంగా—కొన్ని కొన్ని కథలు విశ్వవిఖ్యాతులయిన వాళ్ల కథలకి ఏ విధంగా తీసిపోవో నిరూపించాడు. సోదాహరణంగా—మొట్టమొదట్లో అన్నా చెల్లెలిద్దరూ తన వాదనని త్రోసిరాజనడానికి ప్రయత్నించినా, చిట్టచివరికి లొంగిపోయి ఒప్పుకోవలసివచ్చింది — వాదిస్తున్నాడే గాని మాధవరావుకి ఆవిడ ఏక్షణాన వస్తుందో అన్న తలపు విరామకుండా పని చేస్తోంది. వాదనలోనుండి తాను తేరుకొనే సరికి ఆరు దాటింది—తొందర తొందరగా వెళ్తే రైలు అందుకోవచ్చును. కాని ఉభయుల బలవంతం వల్లనే కాక, ఇంతసేపూ తాము ఎవరిగురించిఅయితే మాట్లాడుతూవచ్చారో ఆవిడను చూసే వెళ్దామని ఉండిపోడానికి అంగీకరించాడు.

పనిమనిషి కేరియరులో భోజనం తెచ్చింది—

లలిత అంది: "ఆవిడ ఈ పూటకిఎక్కడో భోంచేసే వస్తుంది. మీరు ఏ హోటలుకో వెళ్లడం ఎందుకు, ఇక్కడే భోంచెయ్యండి. లేకపోతే అనవసరంగా అన్నం ఉండిపోతుందంది.

చెల్లెలి మాటలను అన్న బలపరచేడు. మాధవరావు మాత్రం ఒకంతట ఇష్టపడలేదు. ఆవిడ భోజనం చెయ్యకుండావస్తే? అప్పటికి హోటళ్లు మూసేస్తే?

లలిత అన్నిటికీ సమాధానాలు చెప్పింది. ఆవిడకి రాత్రి భోజనం అంత తప్పని సరికాదనీ, సాయంకాలం ఫలహారంచేస్తే రాత్రి భోంచెయ్యదనీ, ఏ స్నేహితులతోనో సినిమాకు వెళ్ళి దార్లోనే వాళ్లతో కలిసి భోంచేసి, ఏ పదకొండు పన్నెండు గంటల రాత్రికోగాని మరి రాదనీ నిబ్బరంగా చెప్పింది. మాధవరావుకి భోజనం చెయ్యక తప్పిందికాదు—

ముందు మగవాళ్లిద్దరికీ భోజనం పెట్టి తరవాత తను తింది లలిత—

కొంతసేపు ఏమీ మాటలు లేకుండా గడిచిపోయింది. చీమ చిటుకుమన్నా ఆవిడ అనూరాధా దేవి వస్తున్నట్టు అనిపించేది మాధవరావుకి.

లలిత ఏమీ కాలక్షేపం లేకుండా కూర్చుంటే చికాగ్గా ఉంటుందని తన పుస్తకాలు తీసింది—పుస్తకాలు తియ్యడంతో ఒక బుద్ధిపుట్టింది.

"ఏమండీ! ఇందాకా మీమాటలను బట్టి చూస్తే మీరు చాలా చదువుకొన్నట్టున్నారు. నేనీమధ్యను కొన్నాళ్లు కాలేజీకి వెళ్లలేదు. వెళ్ళినా ఆ పండు మీసాల లెక్చరరుగారు ఏంచెప్తారో ఏమీ బోధపడదు. ఈ ఇంగ్లీషు పోయిట్రీ కొంచెం బోధపరచుకొంటూ ఇలా అనూరాధాదేవిగారు వచ్చేలోగా" అంది.

మాధవరావుకి తన ఎమ్. ఏ. సెకండు క్లాసు పాండిత్యం ఇన్నాళ్ళకు అక్కరకు వచ్చినట్టనిపించింది.

పాఠం పూర్తిఅయేసరికి తొమ్మిదిన్నర దాటింది.

తాను మరి వెళ్తానన్నాడు. వాళ్ళిద్దరూ ఇదుగో మరొక అరగంటలో తప్పకుండా వస్తుంది; పావు గంటలో వస్తుంది అని గడువులు పెట్టుకొంటూ వస్తున్నారు.

"ఉహూఁ ఏదో, సినిమాచూసి, రైలుకి వెళ్ళిపోతాను."

"సినిమా చూసి, అలా వెళ్లిపోవడం ఎందుకు? ఆ వేళకి ఆవిడ తప్పకుండా మేలుకొనే ఉంటుంది. ఆవిడ నిద్రపోవడం తెల్లవారుజామున ఏ నాలుగు గంటలకో—లేవడం నేను పదిగంటలకి కాలేజీకి వెళ్లేవేళకి."

అతనన్నాడు. "అవునండీ, ఆవిణ్ణి కలుసుకోడానికి అదే మంచి సమయం! ప్రశాంతంగా ఉంటుంది. మా గొడవకూడ ఉండదు. మేము నిద్రపోతూ ఉంటాము - ఆవిడ

రాగానే చెప్తారు, మీ రిలా వచ్చి సినిమాకి వెళ్ళేరనీ, సినిమా అయిపోగానే తిరిగి వస్తారని."

"ఆవిడ అప్పుడు రాసుకుంటూ ఉంటారు కాబోలు ?"

"అः ఒక్క పాటిలో మించిపోయిందేముంది లెండి. ఒక్కొక్కనాడు ఆవిడ రాసేదేమీ ఉండదు, అటూ ఇటూ తిరగడం, పదిమార్లు టీ పెట్టుకు తాగడం తప్ప-మీరు వస్తే మీకు టీ దొరుకుతుంది" - అంచేత తప్పకుండా రండి.

"ఉःహుः నేను రావడంకాదు - ఆవిడ దగ్గర వీధి తలుపుకి వేరే తాళం ఉందికదూ-మీరూ సినిమాకి వస్తానంటేనే—"

కొంతసేపు తర్జన భర్జన లయినమీదట ముగ్గురూ సినిమాకి వెళ్ళేరు - అయితే, అటూ ఇటూ రిక్షాల ఖర్చులుగాని, సినిమా టిక్కట్ల ఖర్చులుగాని, కిళ్లీలు సిగరెట్లు టీ ఖర్చులుగాని, అతన్ని పెట్టనియ్యలేదు మాధవరావు. సినిమాకూడా అనుకొన్నంత పాడుగాలేదు - ముఖ్యంగా పాటలు చాలా బాగున్నాయి—

రిక్షా దిగగానే అన్నా చెల్లెలు ముందు దారితీశారు - అతను "రాధమ్మగారూ! రాధమ్మగారూ!" అని పిలిచాడు. మాధవరావు లోపలినుండి వచ్చే కంఠధ్వనికోసం ఊపిరి బిగబట్టి వింటున్నాడు.

ఏమీ జవాబు వినిపించలేదు - అతను తలుపు తట్టుతూఉంటే లలిత అంది - "అన్నయ్యా! తలుపు లోపల గడియ లేదు - ఇదుగో తాళం వేసేఉంది. అంటే ఈవిడ మరి రానేలేదన్నమాట! ఎవరింట్లోనో పడుకొని ఉంటుంది."

మాధవరావు మరి ఉండదలచుకోలేదు - "సరిగా రైలు వేళ నాకు, వెళ్తాను, ఉదయం చూడవలసిన ముఖ్యమైన పనులు కొన్ని ఉన్నాయ"న్నాడు.

ఇంటికి వెళ్ళిన మర్నాడే ఓ ఉత్తరం రాసి పడేసేడు. అనుకొన్నకంటే వేగంగానే జవాబు వచ్చింది, ఆవిడ దగ్గరనుండి. అంత అభిమానంగా తనని చూడాలని వస్తే తాను సరిగా వేళకి ఇంటిదగ్గర లేకపోవడానికి తన విచారాన్ని వ్యక్తపరుస్తూ, ఈమారు ఎప్పుడు వచ్చేదీ ముందుగా రాస్తే తప్పకుండా ఇంటిదగ్గర ఉండగలనని హామీ ఇచ్చింది. ఉత్తరం చివర తాజాకలంలో 'మా పొరుగు వాటాలోఉన్న అన్నా చెల్లెళ్ళ నాగురించి మంచిగాగాని, చెడ్డగాగాని, అతిశయోక్తిగా చెప్పేవన్నీ నిజమని నమ్మరనుకుంటా'నంది - పాపం, ఆవిడకీ తెలుసునన్నమాట ఈ మనుషుల ధోరణి—

* * *

మాధవరావు రిక్షా దిగేడు - వెనకాతల రిక్షామనిషి పళ్ళబుట్ట పట్టుకొని వచ్చాడు.

లలిత ఎదురుగా వచ్చింది—

"ఇవాళ మీ మనసుకి కష్టం కలిగించే వార్త ఒకటి చెప్పవలసిఉంది." అంది లలిత గంభీరంగా మొగం పెట్టి.

మాధవరావు మొగంలో ఏ కదలికా లేదు - లలిత చెప్పుకుపోసాగింది.

"పాపం, మీరు ఇన్నిమార్లు వచ్చి ఆవిణ్ణి చూడ్డం కాలేదు. ఎప్పటికప్పుడు మీ యిద్దరికీ టైము కుదరకుండా అయిపోతూంది. మీరు ఆవిడకని తెచ్చిన పళ్ళూ ఫలాలూ మా పాలబడుతున్నాయి. అయితే, ఇక ముందు మీరు అలా భ్రాంతిపడడానికి అవకాశం లేదు. ఆవిడ గతవారం వెళ్ళిపోడం ఒంటరిగా కాదట. ఇద్దరూ పెళ్ళిచేసుకున్నారని కొందరంటారు, లేదు ఇంకాచేసుకొంటారని కొందరంటారు. పాపం, మీకు కష్టంగానే ఉండవచ్చును, గాని, నాకు మాత్రం సంతోషంగానే ఉంది. మా అన్నయ్యకి ఒక స్థిరమయిన ఉద్యోగం లేదు - ఆవిడ ఖర్చువెచ్చాలను, విలాసాలనూ వీడెక్కడ భరించగలడు—పాపం ఇవాళ ఈ కబురు తెలిసినదగ్గరనుంచీ దిగులుగా ఉన్నాడు. ఇప్పుడే అలా తిరిగి రావడానికి వెళ్ళేడు. వాడు బైటికి తొణికేవాడుకాదు గాని, లోపల్లోపల ఆవిడంటే ఎంతో అభిమానం ఉండేది కాబోలు—ఆవిడ కథలు రాస్తే రాసిఉండవచ్చును గాని మనిషిలో ఏమిటి అంత వింత కనిపించేదో వీళ్ళకి నాకర్థంకాదు - అయినా మీరే అదృష్టవంతులు-ఆవిణ్ణి చూడలేదు, ఇకముందు చూడరేమో? అందుచేత ఓ చిత్రం వచ్చినట్లు ఊహించుకోవచ్చును..."

మాధవరావు మాటలను తూచి తూచి అంటున్నట్టుగా "రికార్డు చేసుకొన్న ప్రసంగం అంతా అయిపోయిందా?" అన్నాడు. ఆమె ఏదో సమాధానం చెప్పబోతూఉంటే వారించి;

"నాకంతా తెలిసిపోయింది-మీఅన్నయ్యే రచయిత్రి అనూరాధ అని - ఇద్దరూ కలిసి నన్నింతలా ఆడించారూ! అబ్బే నాకేం కోపం లేదు. ఉःహుः నన్ను చెప్పనీ, అతనితో కలిసి అంత నాటకం ఆడేవు-ఈమారు నాటకంలో నాతో కలియాలి—"

"ఏమిటో నాకేం బోధపడడం లేదు"

"ఏమీ లేదు, మా అమ్మ తానే నిన్ను చూడ్డానికి వస్తానంది. నేను అక్కర్లేదు నిన్నే అక్కడికి తీసుకొనివస్తా నన్నాను. అయితే, మీ అన్నయ్యకు నువ్వు ఎక్కడికో పారిపోయినట్టు ఉత్తరంరాసి పెట్టాలి. మా ఊరికి ఇప్పుడు సరాసరి కారుపోతుంది. నిన్నక్కడ దిగబెట్టి వచ్చి, నేను మనవాణ్ణి కాస్త గాభరాయింప జేస్తాను. ఆతరవాత అక్కడికి తీసుకొని వస్తాను. తన సమక్షంలోనే మన పెళ్ళి జరుగుతుంది."

"నాకు భయంగా ఉందండీ! అన్నయ్యకు కోపం వస్తే!..."

"లేకపోతే నాకు కోపం వస్తుంది."

"అబ్బ మీ కోపతాపాలకి ఇప్పటినుండీ ఒదగాలన్నమాట? అలాఅయితే నేను రాను"

"బతిమాలుకొంటున్నాను - సరా?"

"సరేగాని, అన్నయ్యని ఎక్కువ బాధ పెట్టకండి."

"నన్ను మాత్రం ఇన్నాళ్ళూ భ్రాంతి పెట్టి, గాలికబుర్లతో తిప్పడం బాగుందేం?"

"నిజానికి ఓడిపోయినవాళ్ళం మేమే - గాలికబుర్లలోనుండి నిజం మనిషిని తీసుకెళ్ళిపోతున్నారు. అయితే ఉత్తరంలో ఏమిటి రాయమంటారు?" ★

# సంజమబ్బులు

'నమస్కారం బాబుగారూ!'

విసవిసనడిచి పోతున్న శంకరం ఆగిపోయాడు. వెనక్కి తిరిగి చూసి 'ఓ... నువ్వా సుబ్బారాయుడూ?...జైలు వాసం ఎంతకాలం?' అన్నాడు.

'మూడు నెలలండి...అయినా అది మీకెలా తెలిసింది బాబూ?...తప్పింది కాదు. మొన్నే విడుదలయ్యాను'

'నిన్ను తీసికెళుతుంటే కళ్ళారా నేను చూశానుగా!...కాని మీ నాన్నను నువ్వి[illegible]ంగా అవినీతికి ప్రోత్సహిస్తున్నావు. ఇదెంతమాత్రం మంచిపనిగాదు నువ్వు గొప్ప త్యాగం చేశాననుకుంటున్నావు కాని అన్యాయాన్ని రెచ్చగొడుతున్నా వన్న సంగతి మర్చిపోతున్నావు.'

శంకరం కొంచెం ఆవేశంగా మాట్లాడటం గమనించిన సుబ్బారాయుడు బెదురుగా చూస్తూ 'అదేమిటి బాబు? అలాగంటారు?' అన్నాడు.

'అసలు సంగతి నాకెలా తెలిసిందని ఆశ్చర్యపడుతున్నావు కదూ! వాచీ సంగతంతా మీనాన్న చెప్పాడులే!'

'వాచీ ఏమిటండి బాబుగారూ!...అదేం కాదండి. అదంతా వట్టిది. మామీద అనుమానపడి ప్రొహిబిషను వాళ్లు రాత్రి వచ్చి పడ్డారండి. మా అయ్య సరిగ్గా దొరికిపోయాడు. అయ్య ముసిలాడు తమాషా చేసి అతనిమీది నేరాన్ని నామీదకు తిప్పుకున్నాను. అనుభవించాను. కన్నతండ్రి ఏం చెయ్యనుబాబు...' శంకరానికి ఆశ్చర్యమేసింది. రామదాసు అన్నమాటలు-ఇతని మాటలు పరస్పర విరుద్ధంగా వున్నాయి.

'అయిదు రూపాయలు అప్పివ్వగలరేమో నని అడుగుదామని తమర్ని పిల్చానుబాబూ!'

కొంతసేపు వూరుకుండి శంకరంఅన్నాడు.

'మీ నాన్నకేనా.. నాకు తెలుసు. లేవు'

సుబ్బారాయుడు మళ్ళీ నమస్కరించి వెళ్ళిపోయాడు.

శంకరం ఒక్కసారి వెనక్కి వెళ్లాడు...

* * *

టైం సరిగ్గా పన్నెండు.

విసవిస నడిచి పోతున్న శంకరం హఠాత్తుగా ఆగిపోయాడు. తుపాకులు బుజాన్నేసుకొని నడుస్తున్న ఇద్దరు పోలీసులమధ్య ఓ యువకుడు తనకు తెలిసినవాడే! చేతికి బేడీలు! శంకరం కళ్ళు తిరిగిపోయాయి. రామదాసే ననుకుంటే ఇతను కూడా దొంగన్నమాట! ఛీ...ఈ లోకంలో ఎవర్నీ నమ్మకూడదనుకున్నాడతను.

'బాబూ!...మావాణ్ణి తీసుకు పోతున్నారండి' అంటూ రామదాసు సమీపించేసరికి శంకరం అతనికేసి ఆవేశంతో చూశాడు. రామదాసుకళ్ళవెంట కారుతున్న కన్నీరు కొద్దిగా వణుకుతూన్న అతని గడ్డాన్ని తడిపేస్తున్నాయి

'కొంచెం ఇలా రండి బాబు...ఎవరైనా వినగలరు. అసలు తీసికెళ్ళాల్సింది నన్ను. అంతా చేసింది నేను నాపాపం అతన్ని చుట్టుకుంది ఆవేళ మీరు వచ్చారు చూశారా!...అప్పుడు పది రూపాయలిమ్మన్నాను. లేవన్నాడు. ఊరుకున్నాను. ఈవేళ పొద్దున్న పదరూపాయలకోసం కక్కుర్తిపడి వాడు పనిచేసే ప్లీడరు గారింటికెళ్లాను ఇంట్లో ప్లీడరు గారు తప్పించి మరెవరూ లేరు. మావాణ్ణి డబ్బిమ్మని అడిగాను.' రామదాసు కొంచెం ఆగి రుద్ధకంఠంతో నెమ్మదిగా చెప్పుకుపోయాడు.

అతను చెప్పిన మాటలన్నీ చిత్రరూపంగా శంకరం హృదయ ఫలకంమీద పరివర్తన చెందాయి...

ప్లీడరు గారు మేడమీదున్నారు. అంతా నిశ్శబ్దంగావుంది. 'ఇప్పుడు నాదగ్గర కానీ కూడాలేదు నేను నిన్న చెప్పానుగా- ఒకటో తారీఖుదాకా ఆగు జీతంరాగానే ముందు నీకిస్తాను. అందాకా ఓపికపట్టాలి మరి నన్ననవసరంగా వేధించకు అన్నాడు కొడుకు.

'అలాపనికి రాదు నాకవసరంలేనప్పుడు నువ్విస్తేమాత్రం ఎందుకు? ఏడవటానికి. ప్లీడరుగార్నడుగు ఆయన దేవుడిలాంటివాడు. తప్పకుం[illegible] ఇస్తాడు.' అని పట్టుపట్టాడు రామదాసు. 'నావల్ల కాదు...' అన్నాడతను.

ఆర్. యం. చిదంబరం

ప్లీడరుగారు ఏదో పుస్తకం కోసం మేడ దిగి వచ్చారు.

'ఎవరోయ్ అది?' అనడిగారు.

'మా అయ్యండి ... ఊరికే చూసిపోదామని వచ్చాడండి...' ప్లీడరు గారు తనకొక్క వలసిన పుస్తకం తీసుకుని మళ్ళీ మేడమీది కెళ్ళి పోయారు.

'అయితే నువ్వడగవన్నమాట!' అన్నాడు పళ్లుపటపట కొరుకుతూ రా[illegible]దాసు.

'అంతే!' అంటూ అతను అమ్మాయిగారి చీరెలు ఆరేయటానికి లోపల కెళ్ళాడు. రామదాసు ఎవరూ చూడకుండా బల్లమీదున్న వాచీతీసుకుని వెళ్ళిపోయాడు. వాచీకి బంగారపు గొలుసు వుంది కూ[illegible]

మరి పావుగంటకు వాచీకోసం వె[illegible]క్కుంటున్న ప్లీడరుగారు 'వాచీ [illegible]' అనడిగారు అతను తెల్లమొహం వేసి లేదన్నాడు. ప్లీడరుగారికి అతనిమీద ఎప్పుడూ అనుమానంలేదు. అతను మంచి విశ్వాసపాత్రుడు. ఇందాక రామదాసు చూపుల్లో కల్మషాన్ని, వంచకత్వాన్ని గుర్తించిన ప్లీడరు గారు 'మీ అయ్యే ఎత్తుకుపోయుంటాడు. ... రాస్కెల్! కళ్లుండగానే గుడ్లు పీకుతున్నాడు. ఇప్పుడే పోలీసులకు అప్పగిస్తాను,' అన్నారు అతని కొడుకు వణికి పోయాడు.

'అయ్యగారూ!...మా అయ్య ఏపీ ఎరగడండి...అతను వట్టిఅమాయకుడు తప్పంతా నాదే! కక్కుర్తిపడి నేనే తీసిచ్చాను. అతను వద్దన్నాడు కాని బలవంత పెట్టాను...అతన్నొదిలేయండిబాబూ!.. నన్ను దండించండి'

ప్లీడరు గారు నమ్మలేకపోయారు. ఆయన క్షమించలేక పోయాడు కూడా ... నిరపరాధిమీద వృధాగా నిందపడింది. తప్పు చేసినవాడు హాయిగా వున్నాడు. అదీ లోకధర్మం పరధ్యానంగా రామదాసు మాటల్ని చేతల్లో అన్వయించుకుంటున్న శంకరం గట్టిగా 'చాలు ... ఇంక నాకు చెప్పకు' అనరిచాడు.

'బాబూ!...వాణ్ణి విడిపించటానికి మార్గం?' శంకరం విసవిస నడిచిపోయాడు..

అయినా తను రామదాసును ఎన్నడూ నమ్మలేదు. ఆనాడు అతన్ని కలుసుకున్న

# ★ సంజమబ్బులు ★

త్వాతే అతని మనస్తత్వం బయట పడింది. శంకరం ఇంకా వెనక్కి వెళ్ళాడు.

*  *  *

ఆకాశం మసిపూసుకుంది. మధ్య మధ్య వురుముతోంది. నిశ్చలంగా చూస్తూ వున్న చెట్లన్నీ క్రమంగా పిశాచాల్లా జుట్టు విరియబోసుకుని ఆడటం మొదలు పెట్టాయి. అనాధుడి ఆర్తనాదంలా చెట్లమీది సంగీతం-

మూడు మైళ్ళదూరంలో వున్న పల్లెటూరికి పొలం పనిమీద వెళ్ళి తిరిగి వస్తున్న శంకరం నడక వేగం హెచ్చించాడు. కొంతసేపట్లో వర్షం మొత్తేస్తుందన్న సంగతి ఖాయం. వర్షం కనక మధ్యదారిలో వస్తే తడిసి ముద్దవటం తప్పించి ఆశ్రయానికి గత్యంతరం లేదు. అదీగాక వర్షం కనక వస్తే తోవంతా జారుతుంది. ఇంక అక్కణ్ణుంచి సర్కసులో తీగమీద నడిచినట్టు బాలెన్సు కాసుకుంటూ నడవాల్సిందే! కాని అతనెంత త్వరగా నడిచినా ఇంకా మైలున్నర పైచిలుకు దూరంవుంది...దబదబని వర్షం కూడా మొత్తేసింది. పదడుగులు వేసే సరికి ఇంక నడవడం అసాధ్యమనిపించింది. ఎదురుగాలి...ప్రకృతి విజృంభించి ఎదుర్కొంటోంది. మానవుడు ఏం చెయ్యగలడు? బట్టలన్నీ తడిసి ముద్దైపోయాయి. అక్కడికి కొంతదూరంలో వోగుడిసె కనపడగానే అక్కడికిలాగో త్వరగా నడిచివెళ్ళాడు. ఆ తాటాకులఇంటికి చిత్తెసు అరుగుంది. దానిమీద కొంతసేపు నిలబడ్డాడు. ఏదో దుర్వాసనకొట్టింది. లోపల ఎవరో నెమ్మదిగా దగ్గుతున్నట్టైంది. ఎవరో అక్షరాలు కూడ బలుక్కుంటూ పుస్తకం చదవటం కూడా వినిపించింది. అతను నెమ్మదిగా కిటికీలోంచి చూశాడు. ఏవీ కనపడలేదు.

జల్లు గట్టిగాకొట్టేస్తోంది. ఆ అరుగుమీద కూడా నిలబడలేకపోయాడు. గజగజమని చలి. బట్టలన్నీ నీళ్ళల్లో నానేసినట్టయ్యాయి. వుండుమీది కారంలా రివ్వన చలిగాలి.

ఎవరో తలుపుతీసుకుని బయటకొచ్చి 'అబ్బ!...ఎంతకీ వర్షం తగ్గటంలేదు. ఇది తగ్గేట్టుకూడాలేదు. ఆకాశం అంతా మూసుకుపోయింది...మ్బ్...' అన్నాడు.

'ఇదుగో అబ్బాయ్?...లోపలకోమాటు రానిస్తావా? ఇక్కడ గట్టిగా జల్లుకొడుతోంది. వర్షం తగ్గగానే వెళ్ళిపోతాను. పూర్తిగా తడిసిపోయాను.' అన్నాడు శంకరం. 'రండిబాబూ!... దానికేవిటి? అయ్యో!...ఇందాక నే పిలవలేకపోయారా? ఈ వర్షంలో ఎందుకు బయలుదేరారు, బాబూ!' అన్నాడతను.

శంకరం లోపలకొచ్చి అతను పరచిన చింకి చాపమీద కూర్చున్నాడు.

'మన దేవూరు?' అనడిగాడతను.

శంకరం చెప్పాడు.

'బాగా తడిసిపోయారు. మార్చుకోటానికి బట్టలేవీ లేవు బాబూ!' అని సిగ్గుపడుతూ దండెంకేసి చూశాడు. ఒక్కటే ఒక్క తువ్వాలు వేలాడుతూంది. శంకరం సంచీలోంచి ముతక పంచ ఒకటి తీసి కట్టుకుని వుత్తరీయం కప్పుకున్నాడు. బయట గాలి హోరుమని ప్రళయఘోష పెడుతోంది. వర్షం ఇంకా ఉధృతమవుతూనేవుంది. ఆ కుర్రాడు గుడ్డిదీపం ముందు కూర్చుని ఒకటో తరగతి పుస్తకం చదవటం మొదలెట్టాడు. శంకరం వచ్చి అప్పుడే పదినిమిషాలైంది. లోపలెవరో రెండు మూడుసార్లు పెద్దగా దగ్గటాన్నిబట్టి అక్కడ ఇతని తాలూకు మనుష్యు లెవరో వున్నారని వూహించుకున్నాడు.

'నా మాటినరా-ఎందుకీ పాడుబుద్ధి, గడ్డి తినిపోటానికి. ఏనాడైనా మన మెరుగుదుమా?'

'నరికేస్తాను...వెధవ ముండా! పీక పిసికేస్తాను. నాయిష్టం...నా సొమ్ము. నువ్వెవతెవే నన్నడగటానికి?'

మాటలన్నీ అపస్వరాల్లా వస్తున్నాయి. యిందాకటి దుర్వాసనకి-ఈ మాటలకు అన్వయం కుదుర్చుకోటానికి శంకరం ప్రయత్నించాడు.

అవతల గదిలోంచి ఇందాక కేకలేసిన వ్యక్తి తూలుతూ బయటికొచ్చాడు. కళ్ళు రెండూ ఎర్రగావున్నాయి.

శంకరం ముక్కు మూసుకుని అతనికేసి చూశాడు.

'ఒరేయ్ వెధవా!...నాకు పది రూపాయలు కావాలంటే ఇవ్వలేవు కాని మీ యమ్మమ్మ దగ్గకు మందు కొంటావట్రా!... నువ్వు నాకు కొడుకువట్రా! నిన్ను చీలుస్తాను. నీ తలకాయ బద్దలు కొడతాను.' అంటూ గోడకి జారబడి కుప్పలా కూలిపోయారు.

'ఇతను మీ నాన్న?'

'అవునండి...ఏం చేస్తాం-ఎన్నో సార్లు చెప్పాను. ఈ వెధవపని మానమని. లోపల మూలుగుతున్నది మా అమ్మమ్మ. రోజూ ఈ విషయంలో మాకు దెబ్బలాటలే!... పై పెచ్చు నాలుగూ అయిదూ తెమ్మంటాడు. ఎక్కడనుంచి తెచ్చేది? ఏం చేసేది? తను సంపాదించేది లేదు...తినికూచోడు.'

'నువ్వేం చేస్తుంటావు?' శంకరం ప్రశ్నించాడు. వర్షం తగ్గేసూచనలు లేవు. కాలం గడపటానికి మార్గాలు లేవు.

'నేను పట్నంలో ఓ ప్లీడరుగారింటో పని చేస్తున్నాను. ఇరవై రూపాయ లిస్తారండి. చాలా కాలంనుంచి నమ్మకంగా పని చేస్తున్నా. ఆ డబ్బుతో వీ ళ్ళిద్దర్నీ పోషించాలి. ఆ ప్లీడరుగారు మంచివాడ కనక అప్పుడప్పుడు మూడూ-నాలుగూ ఇస్తుంటే వీడికి తగలేసేవాడిని అశ్శబ్బాయి నాకు చదువు చెప్తున్నాడండి. ఇదుగో ఈ పుస్తకం చదువుతున్నా. ఈ పాటం కేపు

అప్పజెప్పెయ్యాలన్నారండి. మా అయ్యేమో గోల గోల చేస్తున్నాడు.'

కిటికీతలుపులు గొళ్ళెం పూడి భళ్ళున తలుపులు తెరుచుకున్నాయి. జల్లు గట్టిగా కొట్టింది. ఆ కుర్రాడు మళ్ళీ తలుపు వేసే లోగా కిటికీకెదురుగా కూర్చున్న శంకరం కొంత తడిసిపోయాడు.

'అయితే మీ నాన్నకు కలు ఎక్కణ్ణుంచి వస్తుంది? పోలీసువాళ్ళు పట్టుకోరూ?'

అతను పకపక నవ్వాడు

'అన్నీ తెలిసినవారు తమరే అలాగంటే ఎలాబాబూ? అసలు వాళ్ళకేమాత్రం మా సంగతి తెలుసును కనక నా? మా నాన్న ఒక్కొక్కప్పుడు ఎక్కడైనా తాగేసొస్తాడు. ఒక్కొక్కప్పుడు ఎంత చెప్పినా వినకుండా తనే బట్టి పెట్టాడు బాబూ!... మీరు పోలీసు డిపార్టుమెంటువారు కారు కదా!.. మా అయ్యనేం చెయ్యకండి.'

'అచ్చే!...కాదులే!' అంటూ నవ్వేశాడు శంకరం.

దీపం చమురు లేక గిలగిల తన్నుకుంటోంది. అతను మళ్ళీ కిరసనాయలు పోశాడు.

'అసలందరి లాంటివాడు కాడండి మా అయ్య...చిన్నతనంలో చాలా కష్టాలు పడ్డాడని మా అమ్మమ్మ అంటుంది అయిదేళ్ళకితం మా అక్కయ్య వెళ్ళిపోయిందండి అప్పట్నుంచి ఇంకేనండి సగమై పోయాడు. కష్టపడి పని చెయ్యలేక ఇలా తిరుగుతూంటాడు. రోజుకో వేషం వేస్తాడు. బాధలు మర్చిపోదామని గామోలు ఇలా తాగుతున్నాడు ఏం చేసేదిబాబు?... చెప్పినమాట చెవి వేసుకోడు...నాలుగైదు పొర్లు తన్నులుకూడా తిన్నాడు.'

అతనికి పూర్తిగా స్పృహ తప్ప లేదు. గోడదగ్గర ఇంతసేపూ మెదలకుండా కూర్చున్న వాడల్లా నెమ్మదిగా కొడుకుదగ్గర కొచ్చాడు.

'ఒరేయ్!...వెధవా! రేపు పొద్దుగా రింటికొస్తాను. పదిరూపాయలూ ఇవ్వక పోతే గోలచేస్తాను. జాగ్రత్త!' అంటూ అరచెయ్యి అడ్డం పెట్టుకుని చూశాడు. ఆ గుడ్డి వెలుతుర్లో శంకరం కనిపించాడు.

'బాబూ!...తమరా!' అంటూ గాభరాగా ఒక్కడుగు వెనక్కి వేశాడు.

'అవును రామదాసూ!...మరేం కంగారు పడకు. కాని నీమాటలు విని నేను మోసపోయాననుకుంటున్నాను. అయినా నీ తప్పేముందిలే! నీ మనసు విరిగిపోయింది గా!'

'బాబుగారూ!.. ఏంచేయను? ఈ అలవాటు నా కెప్పుడూ లేదు. ఈ మధ్యనే అలవాటైంది. నా జీవితం ఇలాగైపోయింది. దీన్ని ఒదులుకోలేను. క్షమించండి.' అని శంకరం కాళ్ళుపట్టుకుని అతను భోరుమన్నాడు శంకరానికి రామదాసుని క్షమించాలో కూడనో కూడా అర్థం కావటం లేదు. బయట వర్షం తగ్గుముఖం పడుతోంది కాని పూర్తిగా తగ్గలేదు. రామదాసు నిజంగా పశ్చాత్తాప పడుతున్నదీ లేనిదీ కూడా అతని కర్థం కాలేదు

'ఏంచేసినా చేశావు కాని ఆ కుర్రాణ్ణి మాత్రం సాధించకు నీ మూలంగా అతని కెంతబాధో ఆలోచించు నీ జీవితం ముప్పాతిక మూడు వంతులైపోయింది. మిగిలింది ఎలాగో గడుస్తుంది. అతను అన్నం పడేస్తున్నాడు. ఎందుకే బాధ? కృష్ణా రామా అనుకుంటే కాలం గడుస్తుంది. ఎవరికన్నా టోపీ వేసి డబ్బు సంపాదించి అతనికి అప్పచెప్ప లేవు. ఆలోచించుకో. అసలు నాకు నీలాంటి వాళ్ళంటే నమ్మకం లేదు. కాని నిన్ను నమ్మాను.'

రామదాసు రెండు చేతుల్తోనూ మొహం కప్పేసుకుని మానసిక వ్యధతో తల వంచేసుకున్నాడు.

శంకరానికింక, అక్కడుండ బుద్ధి వేసింది కాదు. అతనికొడుకు పేరుమాత్రం తెలుసుకున్నాడు. సుబ్బారాయుడు. తడిసిన చొక్కా తొడుక్కుని బయటకొచ్చాడు. వర్షం కొద్దిగా పడుతోంది. నేలంతా పాల కమ్మలా జారుతోంది. రామదాసు గుడిసె ఇంకా ఇంకా దూరమవుతూంది.

అసలీ రామదాసుతో తన కెందుకు పరిచయం కలగాలి?...శంకరం వర్షంలో నడుస్తూ మనస్సులో ఇంకా వెనక్కి వెళ్ళాడు

* * *

'బాబుగారూ!'

విసవిస నడుస్తున్న శంకరం హఠాత్తుగా ఆగి వెనక్కి తిరిగి పిల్చిన వ్యక్తికేసి చూశాడు. మనిషి సన్నంగా నలభయ్యేళ్ళ పడి దాటిన వాడిలాగున్నాడు. పొడుగ్గా పెరిగిన గెడ్డం లోతుకుపోయిన కళ్ళు, నుదుటిమీద జీవితానుభవాల్ని స్ఫురింపజేస్తూ గీతలు—కొద్దిగా మాసిన ముతకపంచి కట్టు—దానిమీద పంచలపాక చొక్కా—దానిమీద అతని జీవితానికిమల్లే జీర్ణించి కృశించి అతన్ని వదలకుండా ఉన్న కోటు. చేతిలో పెద్ద సంచీ.

శంకరం ఆగగానే అతనిముందుకు రెండడుగులు వేశాడు కొత్తవాడు. రెండోగంట అప్పుడే అవుతూ ఉంది. శంకరం ఏవన్నట్టు చూశాడు.

"హెడ్మాష్టారు ఎప్పుడు వస్తారండి?"

"వచ్చే వేళైంది...ఎందుకు?"

"చూడండి బాబూ!...కోటి విద్యలూ కూటికోసం—అందులో యిదొకటి. గురువుల దగ్గర నేర్చుకున్న విద్య. ఏవో కొన్ని మాజిక్ పనులు చేస్తాను. హెడ్మాష్టార్ని కలుసుకుని మాట్లాడి నోటీసు పంపమందామని. ఆయన ఏమంటారు? మంచివారేనా? పిల్లలు కలవాణ్ని."

"చాలా మంచివారు. అడగండి" అనేసి వెళ్ళిపోయాడు. మొదట్నుంచీకూడా శంకరానికి ఇలాంటి వాళ్ళంటే అసహ్యమూ-అనుమానమూ. వీళ్ళంతా జీవితాన్ని ఎదుర్కోలేక ఇలాంటి బురఖాలు తగిలించుకొని, జనాన్ని మోసం చేస్తున్నారనేది అతని వాదం—అందుకే అతనికి సన్యాసుల్ని చూస్తే వాళ్ళందర్నీ కట్టగట్టి కాల్చెయ్యాలన్నంత కోపం వచ్చేది. అతను ఇంట్లో ఉండగా ఒక్క బిచ్చగాడుకూడా బియ్యపు గింజ అతని ఇంట్లోంచి తీసికెళ్ళలేడు. అంతటి స్థిరాభిప్రాయం అతనిది.

మరో అరగంటకల్లా 'ప్రొఫెసరు రామదాసు గారిచే మాజిక్ పనులు చేయబడును' అనే నోటీసు సర్క్యులేటయింది. బల్లమీద ఠీవిగా కూర్చున్న రామదాసు చుట్టూ కుర్రాళ్లంతా మూగారు. 'ప్రొఫెసరు' అనే మాటకు అర్థం లేనట్టు ఆ కుర్రాళ్లంతా చూశారు.

"పాపం!....చాలా బీదవాడి లాగున్నాడండి. తలో అణాపట్టు కొచ్చి వెయ్యమని మా క్లాసులో కుర్రాళ్ళందరికి చెప్పాను. మీరుకూడా చెప్పలేక పోయారా?" అని

# సంజమబ్బులు

పైన్నుమాస్టారు అనుగుతుంటే శంకరానికి అమితమైన కోపం వచ్చింది కాని అతను తమాయించుకుని పూరుకున్నాడు.

ఆ సాయంత్రం అందరూ ఓ పెన్ గ్రౌండ్ లో చేరారు. ఆ అల్లరి మూకను అదుపులో పెట్టటానికి నలుగురు టీచర్లు కావలసి వచ్చారు. నలుగురూ నాలుగు మూలలా కాపలా కాశారు. రామదాసు టేబిలుమీద కొన్ని సీసాలు - బీకర్లు వుంచాడు. కోటుకు నాలుగో అయిదో మెడల్సు తగిలించుకున్నాడు. 'ఆ మెడల్సు ఎవరు (పెజంటు చేసింది. అవి బంగారు పతకాలవునా కాదా?' అనే విషయాల్ని గురించి ఎవరూ పరిశోధనలు చెయ్యలేదు. చేతిలో మంత్రదండం లాంటిది పట్టుకున్నాడు. పైన తెల్లటి పిడివుంది.

"అబ్బాయిలూ!...అమ్మాయిలూ! అల్లరి చెయ్యకుండా నేను చేసే (పతి పని జాగ్రత్తగా చూడండి."

కుర్రాళ్లు అల్లరిమాని నిశ్శబ్దంగా చూస్తున్నారు.

రామదాసు చేతిలో వో గోళీకాయ తీసుకుని 'చూడండి! పిల్లలూ! ఇది గోళీకాయ! దీన్ని మాయం చేస్తాను. ముందు చప్పట్లు కొట్టండి వో మాటు. అదీ. ఇంకోమాటు. రైట్ .. ఇదేం సామాన్య విద్య కాదు. కనుకట్టు విద్య అసలే కాదు. దేవతోపాసనా ఫలితం!' అంటూ గోళీకాయ గుప్పిట్లో మూసి చేతిలో వున్న మంత్రదండంతో నాలుగైదు సార్లు తిప్పాడు. కుర్రాళ్లంతా కళ్ళల్లో వత్తులు పెట్టుకుని చూస్తున్నారు.

"హూత్" అంటూ గుప్పిట తెరిచాడు. దూరంగా వున్న శంకరం ఆశ్చర్యపోయాడు. గోళీకాయ మాయమైంది. టేబిలుకు దగ్గరగా వున్న కుర్రాడొకడు తేలు కుట్టినట్టు ఛెంగున లేచి 'అదుగో!.. అక్కడ దాచేశావు' అన్నాడు. రామదాసు కంగారు పడుతూ రెండు చేతులూ జాగ్రత్తగా చూపిస్తూ 'ఎక్కడ?' అన్నాడు.

"అదుగో-ఆ బొటన వేలుకి చూపుడు వేలుకీ మధ్య అన్నాడు యెగిరి గంతు లేస్తూ- శంకరం గబగబా నాలుగడుగులు ముందుకు వేసి చూశాడు నిజం . గోళీకాయ కనిపిస్తోంది. రామదాసు ఏం లేనట్టూ గబగబా దాచేశాడు. మనిషి గజగజలాడి పోయాడు. అతనింత వరకూ చేస్తూ వచ్చిన ఇంద్రజాల మహేంద్రజాల విద్యల్లో ఓటమి ఎరుగని వాడిలా కనిపించాడు ఎందుకో శంకరానికి అతనిమీద కోపం రావటానికి బదులు దయ

(37-వ పేజీ చూడండి)



గాయకులు



ఏ. వి. ఎమ్. వారి హిందీచిత్రం "భాయ్‌భాయ్"లో నిమ్మీ, లలితా పావర్ మున్నగువారు.



ప్రతిభావారి "ఏదినిజం"లో
జోగారావు, జానకి.



హిందీ "దేవదాసు"లో పార్వతిగా నటిస్తున్న సుచిత్రా సేన్.

# బొంబాయి సినిమా లేఖ

'ఝనక్ ఝనక్ పాయల్ బాజే' వంటి చిరస్మరణీయ కళాఖండం నిర్మించి, చలనచిత్రకళలో ఉత్తమ ప్రమాణాలను అందుకున్న దర్శకనిర్మాత శ్రీ శాంతారాంకు డిసెంబరు 18న శివాజీ పార్కులో పౌరసన్మానం జరిగింది. మేయరు శ్రీ ఎన్ సి పుప్పాల అధ్యక్షత వహించారు. దాదాపు మూడుగంటలసేపు జరిగిన ఈ సన్మానసభలో ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు ఎస్ ఎస్ వాసన్, పి కె ఆత్రే, సర్దార్ చందులాల్ షా, బాబురావ్ పాయ్, శ్రీమతి దుర్గాఖోటే ప్రభృతులు మాట్లాడుతూ శాంతారాం ఈ చిత్రనిర్మాణంలో సాధించిన విజయానికి అభినందనలు తెలిపారు. చలనచిత్ర పరిశ్రమకు చెందిన వ్యక్తికి పౌరసన్మానం జరగడం బొంబాయి చరిత్రలో ఇదే తొలిసారి.

* * *

కొత్తసంవత్సరంలో జరిగే గొప్ప సంఘటనల్లో ఎన్నతగ్గది భారత టాకీ రజతోత్సవం. ఈ ఉత్సవాన్ని దాంతోపాటు ఈ సంవత్సరాన్ని చిరస్మరణీయం చేసేవిధంగా, అతి వైభవంగా నిర్వహించడానికి అప్పుడే ముమ్మరంగా సన్నాహాలు సాగుతున్నాయి. భారత ఫిలిం ఫెడరేషన్, చలన చిత్ర పరిశ్రమ శాఖోపశాఖల సహాయ సహకారాలతో ఉత్సవం భారీయెత్తున జరుపడానికి కార్యక్రమాలు తయారు చేస్తున్నది. అఖిల భారత దేశానికి సంబంధించిన ఉత్సవం కాబట్టి-చలన చిత్ర పరిశ్రమకు బొంబాయి రాజధాని అయినప్పటికీ దీన్ని భారత రాజధాని ఢిల్లీలో నే జరుపటం అన్ని విధాలా ఉత్తమం. రాజకీయ నాయకులు, విదేశీయ రాయబారులూ, ఇతర అధికార అనధికార ప్రముఖులూ కూడా ఇబ్బంది లేకుండా ఈ ఉత్సవంలో పాల్గొనడానికి వీలు ఉంటుంది. పైగా ఢిల్లీలో, భారత పారిశ్రామిక ప్రదర్శనం ఏర్పాటయిన స్థలం బహుయోగ్యంగా ఉంటుంది.

* * *

25 సంవత్సరాలుగా దినదినాభివృద్ధి చెంది, ఇప్పుడు పుట్టినరోజు పండుగ చేసుకుంటున్న ఈ తరుణంలో, భారత చలనచిత్ర పరిశ్రమ అభివృద్ధికి దోహదం చేయగల కార్యక్రమాలు, ఏవైనా నిలపెట్టడం సముచితం. ఈనాడు దేశంలో పలువురు నిర్మాతలు "మంచి కథలు" కావాలంటున్నారు. ఈ కొరత తీరాలంటే, ప్రతిభావంతులైన రచయితలదృష్టి చలనచిత్రాల



"టాంగావాలి" హిందీ చిత్రంలో నిరూపరాయ్.

పి ఎల్ సంతోషిచిత్రం "గర్మాగరమ్"లో హాస్యనటుడు ఆగా మున్నగువారు

## ★ బొంబాయి సినిమాలేఖ ★

ప్పు మన్నించాలి ఇందుకు, హిందీలోగాని రాజ్యాంగం గుర్తించిన ఏ ఇతర భాషల లోగాని ప్రచురించబడ్డ మంచి కథలకు బహుమతులు ఇవ్వడం ఉత్తమ విధానం ఇటువంటి బహుమతులు ఏడాదికి మూడు ఇవ్వడానికి ఏర్పాటు చేయవచ్చును

* * * *

ఈ మధ్య హిందీ చలనచిత్ర రంగంలో సమర్థులయిన కొత్త నటీనటులు కొందరు ప్రవేశించారు వారిలో ముఖ్యంగా సునీల్ దత్, జబీన్, రాజేంద్రకుమార్, చంచల్ చిత్రి, మాలాసిన్హా అప్పుడే ఒక స్థాయి సంపాదించుకున్నారు రేపటి తెరతారలు కాగల ఛాయలు వీరి తీరుతెన్నులలో గోచరిస్తున్నాయి అబేహాయత్ లో సమ్మతాని సోదరీమణులు షీలా, హీరా, కోషీ, రేణూ షేకర్ కృష్ణకుమారి, మంజుల నటన చూచిన మీదట వీరిలో ప్రతి ఒక్కరూ కూడా సమర్థుడయిన దర్శకుడి చేతిలో, మంచితారలుగా భాసించ గలరనిపిస్తుంది తారల కరవని ఘోషించే వారికి వీరి తీరుతెన్నులు దారితెన్నులు చూపించవచ్చు పైగా, జౌలాద్, చదన్, కుందన్ వంటివి బాక్సాఫీస్ చిత్రాలు అవడంతో పేరుపోసిన తారలమీద ప్రేక్షకులకు అంతా అనుకుంటున్నంత మోజు లేదనీ, కథ బాగుండడం ముఖ్యమనీ తేలింది.

* * *

ఆరు నెలలపాటు ఆగిపోయిన చిత్రం 'దువాకు తిరిగిఇప్పుడు షూటింగ్ ప్రారంభం అయింది అశోక్ కుమార్, కిశోర్ కుమార్, సుమిత్రాదేవి నటిస్తున్న ఈ చిత్రానికి సత్యేన్‌బోస్ దర్శకుడు

* * *

దేవానంద్ భార్య కల్పనా కార్తిక్, 'జొర్ తుం'లో తన భూమిక నుండవలసింది ఆ పాత్ర శ్యామకు ఇవ్వబడింది

'మునీంజీ'లో నటించి ప్రశంసలందుకున్న దేవానంద్, దరిమిలా అనేక కొత్త చిత్రాలకు కాంట్రాక్టులు కూడా అందుకుంటున్నాడు వాటిలో గురుదత్ ఫిలిమ్స్ సి ఐ డి ఒకటి ఈ చిత్రంలోనే నర్తకి వహీదా రెహమాన్ నటిస్తున్నది.

* * *

భారత్ భూషన్ ఈ మధ్య రెండు కొత్తచిత్రాలలో బుక్ అయ్యాడు ఒకటి నాషన్ నిర్మిస్తున్న 'పార్కీ' ఇందులో నిమ్మి నాయిక రెండవది ఫిలింస్థాన్ నిర్మించే గేవాకలర్ చిత్రం దీనికింకా పేరుపెట్టలేదు బాక్సాఫీస్ చిత్రాలు అనార్కలీ, నాగిన్‌లు తీసిన నంథలాల్ జస్వంత్ లాల్ దీనికి దర్శకత్వం వహిస్తారు ★

# సినిమా వార్తలు

## ఇద్దరు ప్రముఖుల మృతి

సంగీత దర్శకుడు అద్దేపల్లి రామారావు డిసెంబరు 24 శనివారం ఉదయం స్వర్గస్తులైనారని తెలుపుటకు విచారిస్తున్నాము. ఆ రోజునే, నటుడు దాసరి సదాశివరావు కూడా మృతిచెందటం మరొక విషాదకర సంఘటన.

అద్దేపల్లి రామారావుగారు, వాహినీవారి 'బంగారు పాప'కు సంగీత దర్శకత్వం వహించారు. అదే వారి తొలిచిత్రం.

"దాదాపు పాతిక సంవత్సరాలుగా నేనూ రామారావూ అనేక చిత్రాలకు సంగీతం కూర్పులో కలసి పనిచేశాము. రామారావు మరణం చలనచిత్ర పరిశ్రమకూ, వ్యక్తిగతంగా నాకూ తీరనిలోటు. ఆ రోజునే ప్రముఖ నటుడు సదాశివరావు కూడా మృతిచెందాడు. మంచి విగ్రహ స్ఫూర్తి, సామర్థ్యంగల ఒక నటుని తెలుగు సినిమా పరిశ్రమ కోల్పోయింది. డిసెంబరు 24 దుర్దినం" అని చిత్తూరు నాగయ్యగారు సంతాపం వెలిబుచ్చారు.

## శ్రీ బి. ఎన్. రెడ్డి సానుభూతి

అద్దేపల్లి రామారావుగారి మృతికి సంతాపం వెలిబుచ్చుతూ, "సమర్థుడు, ప్రీతిపాత్రుడు, స్నేహమయుడూ అయిన ఒక వ్యక్తిని కోల్పోయాము" అని శ్రీ బి. ఎన్. రెడ్డిగారు అన్నారు.

శ్రీ రామారావుగారు తొలిసారిగా స్వతంత్రంగా సంగీతం సమకూర్చిన చిత్రం రెడ్డిగారు నిర్మించిన 'బంగారుపాప.' అంతః పూర్వం ఆయన హెచ్. ఎం. వి. సంస్థలోనూ, వాహిని ప్రభృతి ఫిలిం సంస్థలలోనూ నాగయ్యగారితో కలసి పనిచేశారు.

నటుడు దాసరి సదాశివరావు వయసు 35 సంవత్సరాలే. 1940 లో ఆయన దక్షయజ్ఞంలో 'శివుడి' గా నటించి చలన చిత్ర రంగంలో ప్రవేశించారు. తిలోత్తమ, సౌదామిని, స్త్రీసాహసం, దీక్ష, గుణసుందరి, రాజు పేద, ప్రతిభావారి బాలరాజు, ముగ్గురు మరాటీలు, రేచుక్క మొదలైన చిత్రాలలో నటించారు.

స్వర్గీయ రామారావు, సదాశివరావుగారల ఆత్మశాంతిని ఆకాంక్షిస్తూ, వారి కుటుంబాలకు సానుభూతి తెలుపుతున్నాము.



# వరలక్ష్మి సలహా

క్రూరసేనుడు ఒక అనాథను అన్యాయంగా వధించాడు. ఈవార్త విన్న రాణి, క్రూరసేనుణ్ని గట్టిగా మందలించాలని మహారాజును కోరింది.

"మందలించడం కాదు దేవీ. మరణదండనే విధిస్తున్నాను." అంటాడు మహారాజు ఉద్వేగాన్ని అణచుకుంటూ...

తెరలతో పరీవృతమై ప్రశాంతంగా ఉండే వీనస్ స్టూడియో ఆవరణ సరిహద్దులో ఉన్న చిన్నగూడెంలోంచి దండోరా డప్పులువినబడ్డాయి హఠాత్తుగా.

"ఇంకొక్క మానిటర్; ఆ తరవాత టేక్" అన్నారు దర్శకుడు రజనీకాంత్. 'సైలెన్స్' అని కేక వేశారు సౌండ్ రికార్డిస్టు సూర్యనారాయణ. నిశ్శబ్దం ప్రవర్తిల్లింది. దూరాన డప్పులవాళ్లకి కబురంది వాళ్లూ ఆగారు. అయితే, అక్కడ ఉన్న ఆడవాళ్లు కొందరికి ఏవో అభిప్రాయభేదాలు కలిగి నట్లుంది. తారస్థాయిలో వాదించుకుంటున్నారు. నిశ్శబ్దంగా ఉన్న సెట్టుమీదకి, సాధకం చేస్తున్న వాళ్ళ సన్నాయి సంగీతం లాగా వాళ్ల పొలికేకలు వినబడ్డాయి. మహారాజుగా నటిస్తూన్న గుమ్మడి పకుక్కునవ్వి "రీరికార్డింగ్ సంగీతం" అన్నాడు. ట్రిక్సరీన్స్ అన్నారింకెవరో. "ఇదెక్కడి సంగీతం. అపరాయేమిటి?" అన్నాడు డైరక్టర్ రజనీకాంత్ నవ్వుతూ.

కొంతమంది పాటపాడడానికి కానీ, ఆపడానికి అర్థణాఅడుగుతారు.

హాలీవుడ్ తారలిద్దరు ఒక విందులో కలుసుకున్నారు. పైకి స్నేహంగా ఉన్నారుగాని లోపల ఒకరంటే ఒకరికి పడదు. ఒకామె ఇలా అడిగింది: "నీ స్వీయచరిత్ర అచ్చు వేయించినట్టున్నావే. చాలా బాగా ఉంది. ఎవరు రాసిపెట్టారు?"

రెండో తార ఇలా అంది: "బాగా ఉందా? థాంక్స్. ఎవరు చదివిపెట్టారు నీకూ:"



జూపిటర్ వారి "సంతోషం"లో చదలవాడ, నాగేంద్రరావు.

# ★ సినిమా వార్తలు ★

ఎస్. వరలక్ష్మికి ఈ బ్యాక్ గ్రౌండ్ సంగీతం ఆపించడానికి చటుక్కున ఉపాయం తోచింది.

"వాళ్లందరికీ కాఫీ పంపించి కాస్సేపు అభిప్రాయభేదాలపై చర్చ ఆపుకోమనండి" అందామె. వరలక్ష్మి సలహాలో రెండవ భాగం కొద్ది క్షణాలలోనే అమలుజరిగింది. మరొక నిముషంలో ఆ 'టేక్' పూర్తిఅయిపోయింది...

'కనకతార' నిర్మాణం వీనస్‌లో చురుకుగా సాగుతోంది. దీనికి సంబంధించిన ఔట్‌డోర్ దృశ్యాలు కొన్ని తీయడానికి మద్రాసుకు సమీపంలో ఉన్న తిరు. మహాబలిపురం ప్రాంతాలకు వెళ్లడానికి గోకుల్ పిక్చర్స్ సన్నాహాలు చేస్తున్నారు. ఈ చిత్రాన్ని జనవరి నెలాఖరుకు, మూకు వంతులు రిపబ్లిక్ దినం 26న విడుదల చేయాలని సంకల్పం.

## సాహిణీవారి కొత్త చిత్రం

అమరసందేశం నిర్మించిన సాహిణీపిక్చర్స్ ఇప్పుడు మరొక చిత్రం నిర్మించ నిశ్చయించారు. ఇదివారి రెండవ చిత్రం. పేరింకా పెట్టలేదు. కవి ఆరుద్ర. శ్రీసబ్నవిస్ రజనీకాంత్ ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తారు.

మీర్జాపురం రాజా "దాంపత్యం" అనే సాంఘిక చిత్రం నిర్మిస్తున్నారు. కృష్ణవేణి, జి. వరలక్ష్మి, విజయకుమార్, రుక్మిణి, జి. యన్. స్వామి మొదలగువారు నటిస్తున్నారు. సంభాషణలు, అనిసెట్టి, పాటలు ఆరుద్ర.

## న్యూ థియేటర్స్ పిల్లల చిత్రం

పిల్లలకు నచ్చే పద్ధతిలో ఒక చిత్రం తీయవలసిందిగా భారత ప్రభుత్వం, న్యూథియేటర్స్ సంస్థను కోరింది. సమాచార శాఖ ఫిలింస్ డివిజన్ ద్వారా చేసే కృషితో పాటు, ప్రయివేటు నిర్మాతలు కొందరిని ఏరి, వారికి కొన్ని చిత్రాల నిర్మాణం ఒప్పగించాలని ప్రభుత్వం లోగడ సంకల్పించింది. ఇందుకు అనుగుణంగానే న్యూ థియేటర్స్‌కు ఇప్పుడు అధికారరీత్యా ఒక చిత్రం ఒప్పగించడం జరిగింది. దీనికి క్రిస్టియన్ వెస్టన్ వ్రాసిన కథను తీసుకున్నారు. సరిగ్గా, సానుభూతితో, అర్థం చేసుకుంటే, ఎలుగుబంటి వంటి జంతువుతో కూడా చెలిమి చేయవచ్చునని ఈ కథ నిరూపిస్తుంది. నితిన్‌బోస్ దీనికి దర్శకత్వం వహిస్తారు. ఈచిత్రాన్ని, ఇంగ్లీషు, హిందీభాషలలో నిర్మిస్తారు. ఆరువేల అడుగులకన్న ఉండదు. దీనికి 'భిమ్సా' అని పేరుపెట్టారు. ఇందులో ఒక ముఖ్య పాత్రను స్వర్గీయ సైగల్ కుమారుడు మదనమోహన్ నిర్వహిస్తున్నారు.

## మిస్ షాండార్ ఆశాభావం

బొంబాయిలో మొన్న జరిగిన పిల్లల చలన చిత్రోత్సవంలో 'మార్టీ అండ్ ది మంకీ" అనే చిత్రం ఒకటి పిల్లలను విశేషంగా ఆకర్షించింది. ఈ చిత్రాన్ని తీసిన బ్రిటిష్ మహిళ శేమాండర్ ఈ సందర్భంలో బొంబాయి వచ్చారు. భారతదేశంలో, పిల్లలకోక చిత్రం తీయాలన్న ఊహ ఉన్నట్టు ఆమె ఇక్కడి వారితో మాట్లాడుతూ అన్నారు. సరియైన కథ, తగిన అవకాశం లభిస్తే, మంచి చిత్రం ఇక్కడ ఒకటి నిర్మించాలని ఆమె సంకల్పం. శేమాండర్ దాదాపు పదేళ్లుగా ఈరంగంలో కృషి చేస్తున్నారు. బ్రిటిష్ ప్రభుత్వ విద్యాశాఖ కోరికపై అప్పట్లో పిల్లల చిత్రం ఒకటి నిర్మించారు. మొన్న మధ్యనే, జకార్తా వెళ్ళి ఇండోనీషియన్ బాలలకై ఒక చిత్రం తీశారు. స్థూలంగా, పిల్లల చిత్రాలను రెండు భాగాలుగా ఎంచవచ్చునని శేమాండర్ అభిప్రాయం. "ఒక రకం బడిలో చూపించేవి. రెండోరకం, బడిలో కాక, విడిగా చూపించదగినవి. అలా అని ఖచ్చితంగా ఒకదాంట్లో పాఠాలు వల్లించడం. ఇంకో దాంట్లో కేవలం వినోదానికే ప్రాధాన్యత ఇవ్వాలని అనటం లేదు. రెండూ మేళవించవచ్చు. అయితే ఏం చూపినా, వాళ్లకి ఆసక్తి కలిగించేటట్లు చూడడం చాలా ముఖ్యం" అని షాండర్ అన్నారు.



## ★ పంజమఖ్యులు ★

(24 వ పేజీ తరువాయి)

సముద్రంలా పొంగుకొచ్చింది. అర్థంలేని ఆవేశం ప్రవేశించింది. గబగబా అందర్నీ గదమాయించి కూచో బెట్టాడు.

మరుక్షణం తనలో కలిగిన ఈ పరివర్తనకు కారణం వూహించుకోలేక బాధపడ్డాడు. బతకటానికి అడ్డదోవలు వెతికేవారినిగురించి తనకున్న అభిప్రాయాలు వుత్తర ధ్రువం నుంచి దక్షిణధ్రువంలోకి ఎగిరిపడ్డాయి.

"వట్టి రాస్కెల్‌లా ఉన్నాడండివీడు! చేతిలో కాస్తోకూస్తో విద్యవుంటే బతక వచ్చుకాని అసలు వీడిదంతా నాటకంలా వుంది" అంటూ పెదవి విరిచాడు తెలుగు మేష్టరు.

ఇక రెండో ఇంద్రజాలవిద్య.. సైన్సు లేబరేటరీలోంచి ఎరువు తెచ్చిన బీకరులో నీళ్ళుపోశాడు. అతని చేతులు-పొడుగ్గావున్న గెడ్డంకూడా కొద్దిగా వొణుకుతున్నాయి.

"ఇప్పుడీ నీళ్లను నీలిరంగుగా మారుస్తాను. ఇది మహేంద్రజాలవిద్యల్లో ఒకటి. ఇప్పుడు బాగా చూడండి. ఈ బీకరులో ఉన్నవి స్వచ్ఛమైన నీళ్లు ఏమాత్రం రంగులేదు. నా చేతులు రెండూ పరీక్షచేసుకోండి. ఏవీ లేదు. ఇందాకట్నుంచి అనుమాన పడుతున్నారు నిమ్మల్ని మోసంచేసి డబ్బు దోచుకుపోదామని నా అభిప్రాయంకాదు. నా విద్యచూసి నచ్చితేనే మీరు డబ్బి వ్వండి"

"అమ్మో!...ముసిలాడు ఘటికుడే! ఠక్కామొక్కీలు తిన్నవాడిలా వున్నాడు." అని సవ్యాడు సైన్సుమాష్టరు. ఇందాకా జాలిగా మాట్లాడిన అతనిలో క్షణంలో మార్పు. రామదాసు రెండో బీకరు తీసుకుని మొదటి దాంట్లో నీళ్ళని రెండోదాంట్లోపోసి కాఫీ కలిపి నట్టు నాలుగుసార్లు కలిపాడు. నీరంతా నీలి రంగుగా మారింది. అందరూ మొదట జరిగినమోసం మర్చిపోయి చప్పట్లు కొట్టారు. 'ఆ రెండో బీకరు అడుగున కాపర్ సల్ఫేటు క్రిస్టల్సు వున్నాయండి...వీడు కళ్లుంపేగా గుడ్డు పీకుతున్నాడు!' అని తను రిసెర్చి చేసిన విషయాన్ని బహిరంగపర్చాడు సైన్సు మాష్టరు. ఆమాట పక్కనున్న కుర్రాళ్ళ చెవిలోపడి దావాగ్నిలా వ్యాపించింది. అందరూ కలిసి మళ్ళీ గోల్లుమన్నారు. నాలుగో అయిదో రాళ్లుకూడా ముసిలాడి మీద పడ్డాయి.

శంకరం కళ్లు తుడుచుకున్నాడు. చేతి మీద రెండు నీటిబొట్లు పడ్డాయి. రామదాసు ఆక్షణంలో అనుభవించిన అనుభూతిని చర్చించుకున్నాడు! అంతా మోసమని తేలిపోయింది. కుర్రాళ్లు ఎవరిమట్టుకు వాళ్లు వెళ్లిపోతున్నారు. మేష్టర్లుకూడా జారుకున్నారు. హెడ్మాష్టరుమాత్రం అతన్తో "నేను చాలా విచారిస్తున్నానండి. ఏనిటి చెయ్యటం? ఎంతో విద్యవున్నవాళ్లే ఈ వానరమూకముందు నెగ్గుకు రాలేరు. అటువంటప్పుడు మీరు? ..." అంటూ ప్రశ్నార్థకంగాచూసి అతని చేతిలో పావలా వుంచారు అతన కే మహాప్రసాదంగాభావించి జేబులో వుంచుకుని సామానంతా సంచీలో సర్దుకున్నాడు. ఏకుర్రాడూ దయదల్చి కానీ కూడా ఇవ్వలేగు.



"న్యాయంగా అందరికి మల్లే అడుక్కోకూడదూ?"...అంటూ సాగిపోయారు.

మోసం చేయటంలో నేర్పుండాలి. ప్రతి విషయంలోనూ వంచకత్వమే! ఆ మాటకొస్తే తను చేసేది? హెడ్మాష్టారు సూపర్‌విజన్ రౌండు పూర్తిచేసుకుని వెళ్ళేదాకా జాగ్రత్తగా పాఠంచెప్పి ఆ తర వాత టేబిలుమీద కాళ్ళుతన్ని పెట్టికూర్చోటంలేదూ? క్లాసుకు సరైన టైముకు వెళుతున్నాడా?...రామదాసుకి పావలా దొరికింది అంతే! శంకరం ఆలోచనలు ఇంకా సాగిపోయాయి.

పిల్లలు కలవాణ్ణని చెప్తున్నాడు. నలుగురు పిల్లలూ అతను వెళ్ళగానే చుట్టుముడతారు. ఏంతెచ్చాయిలం తెచ్చాడో నని కళ్ళు కాయలు చేసుకుని ఎదురుచూస్తూంటారు. ఇంట్లో ఏవీవుండవు. అన్నీ నిండుకుంటాయి . రామదాసు ఏం చెప్తాడు? ఈ పావలాతో ఎవరికోరికలు తీరుస్తాడు? దీనంగా నిలబడతాడు. అతనిభార్య (ఒక వేళవుంటే) ఘొరుమంటుంది "బాబుగారూ!...సెలవండి!" అంటూ రామదాసు అతని ఆలోచనలకు అడ్డుపడ్డాడు సంచీ బుజానతగిలించుకుని వెళ్ళిపోటానికి తయారుగావున్నాడు.

"ఏ మాత్రం దొరికింది?" తెలిసుండీ అనుమానం తీరటానికడిగాడు.

"పావలాండి!" అన్నాడతను పేలవంగా నవ్వుతూ.

"ఇప్పుడు మీరెక్కడికెడుతారు? మీ ఇల్లెక్కడ?"

"ఇంటికి వెళ్ళలేనండి...మూడు మైళ్ళ నతల. అదీకాక వుత్తచేతుల్తో వెళ్ళలేను. పిల్లలకేమివ్వను? ఆబాధ ననుభవించే దానికంటె ఈ చుట్టుపక్కలెక్కడైనా సత్రంలో పడుకుంటాను." శంకరం ఒక్కక్షణం ఆలోచనలో పడ్డాడు. రామదాసు సమాధానంకోసం ఎదురుచూశాడు. "పోనీ నాయింటికి రండి. రేపు వెళుదురుకాని. అంతదూరం నడిచివెళ్ళలేరేమో!"

# సంజ మబ్బులు

'నేను మొదట్నుంచీ గమనిస్తున్నాను. మీరు దయామయులు. మీ ఆదరానికి...' అని ఆగిపోయాడతను. ఇద్దరూ కలిసి నడవటం మొదలెట్టారు.

"మీదగ్గర విద్య లేనప్పుడు నలుగుర్నీ ఇలా మోసం చేయటానికి ప్రయత్నించట మెందుకు? అవమానపడట మెందుకు? ఇంత కంటె బతకటానికి మార్గం లేదూ?" అతన్నింటికి రమ్మనటం ఇందుకేనన్న భావన రామదాసుకు కలుగుతుందేమోనని శంకరం తరవాత ఫీలయ్యాడు.

రామదాసు ఎండుటాకు రాలినట్టు నవ్వాడు...

"ఏం చేయను చెప్పండి? ఎన్నో మార్గాలు తొక్కాను. ఎక్కడ కెళ్ళినా - ఏం చేసినా నాకు అపజయమే కాని జయం లేదండి. నా బతుకే అంత. హస్తలాఘవ విద్యలు నాకు బాగావచ్చు. కాని దురదృష్టం కొలదీ—"

శంకరానికి నవ్వొచ్చింది అద్దంలో చందమామను పట్టిస్తానంటున్నాడు రామదాసు.

ఇద్దరూ మౌనంగా సాగిపోయారు.

భోంచేసిన తర్వాత రామదాసు కూడా తెచ్చుకున్న తంబురా మీటుతూ పాటలు పాడుతున్నాడు.

"బాబుగారూ!...ఈ దౌర్భాగ్యుణ్ణి ఈ వూళ్లో ఇలా ఆదరించినవాళ్లెవరు?... సెలవు" అన్నాడు మర్నాడు వుదయం. శంకరం అయిదు రూపాయల కాయితం అతని కందిస్తూ 'ఇది వుంచుకోండి...ఈ వూళ్లో మీకింకెలాంటి సాయమూ దొరకదు.. ఏవిటో! అంతా చిత్రంగావుంది!' అన్నాడు.

అతనది కళ్ళకద్దుకుంటూ వెళ్లిపోయాడు..

ఆనాటి రామదాసు ఈనాడు తాగుబోతుగా...

కొడుకుకోసం ఏడుస్తూ తరవాత...

* * *

విపరీత నడుస్తూ ఆలోచిస్తూ పోతున్న శంకరం వంతెనదగ్గరాగాడు. ఈ రామదాసుతో స్నేహం తన కెలా వుపకరించింది? ఇహముందు అత నెలా బతుకుతాడు... తనన్నట్టు అత నింకెంతో కాలం బతకడు.. ఇంతకీ సుబ్బారాయుడు జైల్లో పడటానికి అసలు కారణం? ఇద్దర్లో ఎవరిని నమ్మటం?

"అతని పితృభక్తికి 'హేట్స్ ఆఫ్'" అనుకున్నాడు.

ఇప్పటికూడా తనకు రామదాసంటే అసహ్యం కాని; కోపం కాని కలగటం లేదు. రాయిలాంటి తన అభిప్రాయాలన్నీ చిత్రంగా మారిపోయాయి. 

పెద్దకథ

వాసమూర్తి

(గత సంచిక తరువాయి)

కమల తన అశక్తతకు కుమిలిపోతూ లోపలికి పోయి మంచంమీద పడింది. ఎలా భర్త మనస్సు మార్చడం? బుద్ధిపూర్వకంగానే తెలుసుకో నిచ్ఛగించని వారికి తెలపడ మెలా? ఇదే ఆలోచిస్తూ ఉంది. రాజారావు ముందు తాను బలహీనురాలుగా కన్పించడం ఆమెకు మరీ బాధ కలిగించింది. ఆ కోపంలో మధ్యాహ్నం భోజనం వేళకు కూడా కమల తన గదినుంచి కదలలేదు. రాజారావు భోజనం చేసి వెళ్లిపోయాక భోజనం తన గదికి తెప్పించుకుని తింది. మరికొంత సేపటికి వంట మనిషి చెప్పిన దానిని బట్టి ఆరుగు పొరుగు స్త్రీలందరూ వచ్చారు. వాళ్ళను చూసి కమల ఎదురు వెళ్ళి తీసుకు వచ్చి తివాచీ మీద కూర్చోపెట్టింది. మర్యాదగా పలకరించింది. ఇంట్లో ఆ వేళటి శాకపాకాలతో ప్రారంభమయింది వారి సంభాషణ. కమల వారి ప్రశ్నలకు జవాబు చెప్పింది. అక్కడి నుంచి వాళ్ళ సంభాషణ ఎంతవరకూ కమల అదృష్టాన్నీ, ఆమె భర్త ఐశ్వర్యాన్నీ పొగడడంతో నిండిపోయింది. ఆ పొగడ్తలలో కమలకున్నవన్నీ తమకు లేవే అనే ఈర్ష్య చాలా మిళితమై ఉంది. కొంతసేపు పొగడి పొగడి అక్కడి నుంచి ఊళ్లో ఇతర స్త్రీలను గురించీ, వారి లోపాలను గురించీ వాళ్లు పేరంటాలెలా చేసేదీ, నగలెన్ని వేసేదీ, ఏ శుభకార్యమప్పుడైనా సంతర్పణ చేయ వలసి వస్తే ఏం కక్కుర్తి పనులు చేసేదీ మొదలైనవన్నీ చర్చించ సాగారు. వాళ్ల చర్చలో కమలకేమీ ఆసక్తి కలగలేదు. విసుగు కలగసాగింది. అయినా వాళ్ళ నసహ్యించుకోలేదు. పాపం, వాళ్ళకు చదువు లేదు. సంస్కారం కూడా తక్కువే. బాహ్య ప్రపంచం గురించి జ్ఞానం వారికి అత్యల్పం. కళా సాహిత్యాలు వంటివి వాళ్లకు పూర్తిగా అపరిచితాలు. ఇక వారి సంభాషణలలో వంటలూ పేరంటాలూ కాక మరేమి రాగలవు? తను చదువుకున్నది కాబట్టి వాళ్ళతో బాగా పరిచయం సంపాదించి మెల్లగా నూతన విషయాలలో అభిరుచి కలిగించాలి, అంతేకాని వారిని ద్వేషించడంవల్ల ప్రయోజనమేమీ లేదు. అనుకుంది. అందువల్ల వాళ్ళేమిచెప్పినా ఓపికతో ఊఁ కొట్టింది. చివరకు వాళ్లు వెళ్ళి వస్తామని లేచారు. కమల పళ్ళూ తాంబూలాలు తెప్పించి అందరికీ ఇచ్చి మర్యాదగా సాగనంపింది. లోపలికి వచ్చే సమయానికి భర్త ఎక్కడికో ప్రయాణంమీద ఉన్నాడు. సిల్కు లాల్చీ తొడిగి గ్లాస్కో పంచ కట్టి జరీ అంచుల కండువా వేసుకున్నాడు. తల దువ్వుకుంటున్నాడు. కమల దగ్గరకు వెళ్లగా సెంటు గుప్పున కొట్టింది. కమల కుతూహలంలో "ఎక్కడికో ప్రయాణమవుతున్నట్లున్నారే" అంది.

రాజారావామె వైపుకు తిరిగి "ఔను, రాణీ" అన్నాడు.

కమలకా పిలుపు కోపం తెచ్చింది. "నన్ను రాణీ అనకండి. నాకు చాలా అసహ్యంగా ఉంది. కమలా అనే పిలవండి." అంది.

"రాణీ అంటే బాగుండలేదూ? పోనీ చిలకా అని పిలవనా?" అని గట్టిగా నవ్వాడు రాజారావు.

కమల మూతి ముడుచుకుంది. రాజారావామె బుగ్గలు నొక్కుతూ "సరే పోనీ, కమలాదేవీ అంటాను-చదువుకున్న దానివి కాదూ మరి. ఏదీ నవ్వు ముందు" అని ఆమె పెదిమెల మీద వేలుతో కొట్టాడు.

కమల నవ్వింది. "నేను ఎక్కడికేనా వెళ్తే కారణం చెప్పమంటున్నారే, మీరెక్కడికి వెళ్తున్నారో నేనడగవచ్చా?"

"అడగ కూడదు. రాణీగారి రాకపోకలను గురించి రాజుగారు అడిగితే అడగవచ్చును కాని రాజుగారి రాకపోకల గురించి రాణిగారు ప్రశ్నించకూడదు."

"ఏం, ఎందుకూ?"

"రాణీగారు స్త్రీ కాబట్టి, రాజు రాజే కాబట్టి" అని మళ్ళీ నవ్వాడు రాజారావు.

"స్త్రీ మాత్రం మనిషి కాదూ? పురుషుడి కన్న స్త్రీ ఎందుకు తక్కువో చెప్పగలరా?- అయినా మీరు నన్ను శాసించినట్లు నేను మిమ్మల్ని శాసించటం లేదే. వెళ్లవద్దని అడ్డుపడడం లేదే. పరాయి దానిని కాదు కదా. మీరెక్కడికి వెళ్తున్నారని ఊరికే నే అడిగాను. దానికి జవాబుచెప్పకపోతే మీ యిష్టం" అంది కమల కొంచెం బాధగా.

రాజారావు ఒక క్షణం ఆగాడు. కమల మొగంలోకి చూశాడు. మెల్లగా దగ్గరకు పోయి తల నిమురుతూ "కోపం వచ్చిందా కమలా, నీవడిగినందుకు నే నేమీ అనను లే. ఒక స్నేహితుడింటికి వెళ్లాలి. అంతకన్న వివరాలేమీ చెప్పను, నీవడగకు మరివస్తాను. నీవు పెందరాళే భోంచేసి పడుకో, నా కోసం కనిపెట్టుకు కూర్చోకు" అని నౌకరు బండి తీసుకురాగా వెళ్లి బండిలో కూర్చున్నాడు. బండివెళ్లిపోయింది.

కమల కొంత సేపక్కడే నిలబడి మెల్లగా లోపలికి వచ్చి వంటమనిషి దగ్గరకూర్చొని "ఏం సుబ్బమ్మా, బాబుగారెక్కడకు వెళ్లారో తెలుసా?" అని అడిగింది.

"బాబుగారు వెళ్లారామ్మా?" అనిఅడిగింది సుబ్బమ్మ తన కేమీ తెలియనట్లు.

"అవును ఇప్పుడే వెళ్లారు. ఎవరో స్నేహితుడింటికి వెళ్ళారట. ఏ స్నేహితుడింట్లో నేనా ఏ శుభకార్యమేనా ఉందా? నీకు తెలిసే ఉంటుంది. చెప్పు సుబ్బమ్మా" అని ఒత్తిడి చేసింది కమల.

"అయితే గోవిందంగారి యింటికి వెళ్లి ఉంటారమ్మా. ఈ వేళ ఆయన ఇంటి దగ్గర దేవుడి కళ్యాణం భోగం మేళం అదీ ఉంటుంది" అంది వంటమనిషి.

"గోవిందం గారెవరు?"

"మనింట్లో పేకాటకి బ్రహ్మీసాలాయన వస్తారే ఆయనే నమ్మా"

"ఆయనా!" అని కమల అంతకన్న ఏంచి

వంట మనిషిదగ్గర భర్త రాకపోకలను గురించి చర్చించడానికి ఇష్టం లేక తన గదిలోకి వెళ్ళిపోయింది. భర్త వచ్చే వేళకు తన సౌందర్యమంతా అత్యాకర్షణంగా చూపి చేస్తాను. ఏది కోరితే అది ఇస్తాను. మన వాళ్ళు భార్యఅంటే భరింపబడేది అంటారు. భరించేవాడు భర్త. నిన్ను భరించడం నా విధి. నేను చెప్పినట్లు నడుచుకోవడం నీ విధి. అంతేకాని నేనెందుకు మీతో సమానంగా ఉండకూడదంటూ మొదలు పెట్టకూడదు. అలాంటివి నేను సహించను. కమలా, నగలు కావాలా? డబ్బు కావాలా? ఇంకేమయినా కావాలా? అడుగు ఇస్తాను. కాని మనవాళ్లు అందరూ ఎలా ఉంటారో అలాగే నీవూ ఉండు. ఒకటి చెప్పాలనుకుంటున్నాను. తెల్లవాళ్ళను చూసి మనవాళ్ళు కూడా ఈ పౌడర్లూ స్నోలూ వంటివి వాడడం నాకు నచ్చదు. సంసారం చేసే స్త్రీలు సంప్రదాయ కుటుంబాలలో పెరిగిన స్త్రీలు అలాంటివి వాడడం నాకు వెగటు కలిగిస్తుంది. ముగ్గు పూసుకున్నట్లు పూసుకుంటే ఏం వచ్చింది?"

"ముగ్గు పూసుకున్నట్లు పూసుకునేవాళ్లు తెలీనివాళ్లు. ఏమైనా సౌందర్యంకోసం వాడే సాధనాలనేమాట మరచిపోకు. అవే సౌందర్యం అనుకోవడం తెలివితక్కువ. తెలిసి వాడినప్పుడు ఏవి వాడితే తప్పేమిటి? ఏమైనా అందం పెంచుకోవడాని కుపకరించేవేగా. అలాంటప్పుడు పసుపూ కాటుకా రాస్తేనే మంచీ, పౌడరూ స్నోలూ వాడడం తప్పు ఎలా అవుతుంది? రైలుబండి మన దేశంలో మొదట్లో లేదని ఎద్దుబండే ఉండేదని, రైలుమీద మానివేసి ఎద్దుబండి మీదే ప్రయాణం చేస్తామా?" అని అడిగింది కమల రాజారావు కళ్లలోకి చూస్తూ. రాజారావేమీ మాట్లాడలేకపోయాడు.

"మన పూర్వులెలా ఉన్నారో అలాగే ఉండమన్నారు కదా. పోనీ అజంతా అమరావతీ బొమ్మలలో ఉన్న స్త్రీలలా తయారయితే మీరు ఒప్పుకుంటారా?" అంది కమల నవ్వుతూ.



రాజారావు చిరాకు పడ్డాడు. "అదిగో మళ్ళీ వాదిస్తున్నావు. అదే కూడదని నేను చెప్పేది. నాకీ వాదనలేమీ పనికిరావు. మర్యాదకల మన సంప్రదాయ కుటుంబాల స్త్రీలు ఎలా ఉంటారో అలాగే నిన్నూ ఉండమనే నేనూ చెప్పేది. అలా ఉంటే నిన్ను పువ్వుల్లో పెట్టుకొని పూజిస్తాను" అని కమల బుగ్గలు గిల్లి చక్కాపోయాడు రాజారావు. కమల కొంతసేపలాగే నేలమీద పడిన పుస్తకం తీసి చదవడం మొదలు పెట్టింది.

రాజారావు వచ్చేవేళకు కమల మళ్ళీ పుస్తకం చదువుతూనే వుంది. రాజారావు పుస్తకం పరికించి చూశాడు. "మళ్ళీ అదే పుస్తకం. కమలా నీకెంత చెప్పినా తెలియటం లేదే. అవి బుద్ధులు చెడగొట్టే పుస్తకాలని. మగాడిలా ఉన్నా ఆడదానివే. మానం, మర్యాదా కాపాడుకోవాలి. గౌరవంగా బతకాలి. నీకు తగిన కాలక్షేపం లేకపోబట్టే ఇలాంటి పుస్తకాలమీద పడుతున్నావు. ఇరుగు పొరుగిళ్ళవాళ్ళు ఉన్నారు కదా వారితో కాలక్షేపం కారాదూ? వారితో మాట్లాడడం నీకు తక్కువగా కనిపిస్తుంది కాబోలు. వాళ్ళు నీలా చదువుకోలేదు అంతేగా. వాళ్ళు వంటలూ పేరంటాలూ గురించి మాట్లాడతారనే కాదు నీకు లోకువ. కాని నీవు కోరేదేమిటి? ఇంగ్లాండులోనా, అమెరికాలోనా, బొంబాయి, కలకత్తా, ఢిల్లీలోని ఆడవాళ్ళను గురించి మాట్లాడటమేగా. నీ గొప్పేమిటి? నీవు వాళ్ళని గురించి మాట్లాడితే వీళ్లు ఊళ్ళోవాళ్ళని గురించి మాట్లాడతారు. అంతేగా భేదం. అయినా నీకు చేతులనిండా పనిలేకపోవడం ఒక పెద్ద లోటే. వంటమనిషి లేకపోయి నీవే వంటచేసుకోవలసివస్తే అప్పుడింటి పుస్తకాలు చదవడానికి అంత తీరిక ఉండకపోవునేమో, కాదూ" అన్నాడు రాజారావు. కమల ఏమీ మాట్లాడలేదు.

మర్నాడు పొద్దున కమల వంటమనిషిని పిలిపించి "నీవు ఇదివరకొకమారు మీ ఇంటికి వెళ్ళివద్దామనుకున్నావు కదూ. ఈ వేళ వెళ్ళి పదిరోజులుండిరా, సెలవు ఇస్తాను" అంది. "పోనీలెండమ్మా వెళ్ళను" అంది వంటమనిషి. "కాదు వెళ్లు నీకు జీతంకూడా ముందిస్తాను" అని డబ్బు తీసుకొనివచ్చి ఇచ్చింది. "వంటచేసిన తరువాత వెళ్తానండి" సుబ్బమ్మ. "కాదు ఇప్పుడే వెళ్లులే. బస్సు దొరుకుతుంది. ఎండవేళ ప్రయాణం కష్టంగా ఉంటుంది" అని చెప్పి ఆమెను పంపించివేసింది. తలస్నానం చేసి, పొయ్యి రాజేసి, భర్తకు వడ్డించింది కమల. రాజారావు వంటకాలు రుచిచూసి "నీకు కోపం కానీ, నిన్ను రాణీ అనే పిలవాలనిపిస్తోంది కమలా నిజంగా నీవు రాణివే" అన్నాడు. కమల గర్వంగా చూస్తూ చిరునవ్వు నవ్వింది.

సాయంత్రం సూర్యనారాయణరావుగారి భార్య వరలక్ష్మి వచ్చింది. రాజారావప్పుడు ఇంట్లోనే వున్నాడు. కమల ఆవిడకు ఇల్లంతా చూపి తనగదికి తీసుకెళ్ళింది. ఇద్దరూ కులాసాగా కొద్దిసేపు కబుర్లు చెప్పుకున్న తరువాత వరలక్ష్మి "రేపు మా చంటి పిల్లవాడి పుట్టినరోజు పండుగ నీవు తప్పక ముందే రావాలి" అంది. కమల గుంజాటనలో పడింది. "రేపు వీలుంటుందేమోనండి" అని నసిగింది. ఆవిడ కమల చేతులు పట్టుకొని "అదేమిటమ్మా నీవే రాకపోతే ఎలా? నీవు రాకుంటే ఊరుకుంటాననేమిటి? మళ్ళీవచ్చి నేనే లాక్కుపోతాను. తప్పక రావలసిందే" అంది. కమల వస్తాననక తప్పలేదు. "నేనే వస్తాను లెండి, మీరు మళ్లీ రావద్దు" అని చెప్పింది. వరలక్ష్మి కమలతో పదిసార్లు రావాలని చెప్పి వెళ్ళింది.

అతన్ని చకితుణ్ణిగా చేయాలనుకుంది. భోజనంచేసి నీలంరంగు సిల్కు చీరకట్టుకొని బంగారు చుక్కలున్న ఎర్రసిల్కు రవిక తొడిగి, తలనిండా మల్లెపూలు పెట్టుకొని మొగానికి స్నో రాసుకొని, పౌడరద్దుకొని కాటుక దిద్దుకొని, నుదుట తళుకు కుంకుమతో చక్కని తిలకం ధరించింది. పాన్పు చక్కగా అలంకరించి, మల్లెపూదండలు వేళ్లాడతీసి, అగరువత్తులు వెలిగించి పాన్పుమీద కూర్చొని భర్తరాక కోసం ఎదురుచూడ సాగింది. ఏడైంది. ఎనిమిదైంది, తొమ్మిదైంది రాజారావు రాలేదు. పదిదాటి పదకొండు కూడా కొట్టింది. రాజారావు రాలేదు. కమల ఇక నిరాశచేసుకొని దుస్తులు మార్చివేసి మల్లెపూదండలు తీసివేసి, అగరువత్తు లార్పివేసి మంచం పై పడిపోయింది. ఒంటిగంటవేళ ఎవరోగట్టిగాపట్టుకులాగుతున్నట్టై ఉలిక్కిపడి లేచింది. భర్త! కాని సరిగా నిలబడలేక పోతున్నాడు. తూలుతున్నాడు. కమల "ఏమిటండీ ఇది? ఇలా ఉన్నారు? అంది ఆత్రంగా. రాజారావు "ఊఁ ఊఁ" అంటూ తూలుతూ పక్క చూసుకొని దానిమీదవాలి అలాగే నిద్రపోయాడు. కమల గొంతుక ఎండిపోయింది. గుండె దడదడ కొట్టుకుంటి. రాజారావు మొగం చూస్తే కంపం పుట్టుకు వస్తోంది. అక్కడనుంచి పరుగెత్తుకుపోవాలనిపించింది, కాని గది దాటివెళ్తే నౌకర్లకు

తెలిసి గుసగుసలు బయలు దేరుతాయని అలాగే నిలబడి, కొంచెం ధైర్యం తెచ్చుకొని కళ్ళు మంచంమీద కూర్చుంది. నిద్రరాలేదు. అలాగే మంచం వెనుక కోడుకు ఆనుకొని కూర్చొని మిగిలిన రాత్రి జాగరం చేసింది.

ఆవేళ రాజారావు చాలా ఆలస్యంగా లేచాడు. అతనికి తూలు డూ అదీ తగ్గి పోయింది కాని కళ్లు మాత్రం జ్యోతుల్లా ఉన్నాయి. ఆ కళ్ళలోకి చూడడానికి భయంవేసి కమల అతని ఎదుట నిలబడ డానికి సాహసించలేక పోయింది. తన గది లోకి పోయి పుస్తకంలో మునిగి పోయింది. రాజారావు చిన్ననాటి చెలికాళ్లు వచ్చారు. పేకాట సమాజం సమావేశమయింది. మధ్యాహ్నం వేళ ఆట ఆపుచేసి వాళు ఇళ్లకు పోయారు. రాజారావు లోపలికి వచ్చాడు. కమల కనిపించలేదు. పోయి భోజనం చేసి హాలులో పడుకున్నాడు లేచిన తరువాత కూడా కమల కనిపించకపోగా ఆమె గది లోకి నడిచాడు.

కమల పుస్తకం మొగానికి అడ్డంగా ఉండడం వల్ల అతని రాక గమనించలేక పోయింది. రాజారావు కొంతసేపు గుమ్మం దగ్గరే నిలబడి చూశాడు. కొంచెం విసుగు వచ్చి ముందుకు రెండడుగులు వేసి కమల చేతిలో పుస్తకం ఒక్క అదుటున లాగివేసి మూలకు గిరవాటు వేశాడు. కమల అదిరిపడి చూసింది. ఒక్క క్షణం ఆమె కోపం పట్టలేక పోయింది. కాని లోలోన అణచుకొని శాంతంగా అలాగే కూర్చుంది కదలలేదు. రాజారావు ఆమె కళ్లలోకి తీక్షణంగా చూశాడు. కమల ఆ చూపులకు బెదరకుండా అతనికేసి చూసింది. రాజారావు పోయి కమల ప్రక్కను కూర్చున్నాడు. "రాణీగారు ఈ లోకంలో లేనట్లున్నారే! ఏ ఇంగ్లాండులోనో, అమెరికాలోనో విహరిస్తున్నట్లున్నారు. ఉన్నది అమలాపురంలో రాజారావు ఇంట్లో అన్న మాట మరచిపోయారు కాబోలు," అన్నాడు హేళనగా చూస్తూ కమల పెదవులు బిగించుకొని కూర్చుంది. "ఓహో రాణిగారు మౌనవ్రతము పట్టినట్లున్నారే. కోపం వచ్చింది కాబోలు. కోపంలో కూడా నీ మొగం చాలా అందంగా ఉంటుంది, రాణీ. నీవు మాట్లాడకన్న ఇలా మౌనంగా కూర్చున్నా బాగానే ఉంటుంది నీవు పీడరులా వాదిస్తావు. అది నీకు బాగుండదు రాణీ. ఆడది ప్లీడరేమిటి? అందులోనూ చిలకలాంటి నీవు వాదించడం అసలు బాగుండదు, రాణీ" అంటూంటే కమల నోరు తెరచి "నన్ను రాణీ అని పిలవవద్దని చెప్పాను కాదూ. నాకు ఆ పిలుపంటే చాలా అసహ్యమని మళ్ళీ చెప్పాలా?" అని వెంటనే మూతి బిగించి వేసుకుంది. "ఆఁ, అన్నట్లు మరచిపోయాను. కమలాదేవిగారూ అని కాదూ అనవలసింది" అని నవ్వాడు రాజారావు. మళ్ళీ ఆమె చేయి తన చేతుల్లోకి తీసుకొని రాస్తూ, నేలమీద పడిఉన్న పుస్తకం కేసి చూసి "కమలా, నీవిలాంటి పుస్తకాలు చదవడం కట్టిపెట్టు. ఆడది ఎందరి మొగుళ్ళను మార్చుకున్నా తప్పులేని దేశాలవాళ్లు రాసే పుస్తకాలవి. ఆడవాళ్లూ మొగవాళ్లూ కలిసి పబ్లిగ్గా గంతులు వేసే దేశాలవాళ్లు రాసే పుస్తకాలవి. అవి చదివి అర్థంలేని పిచ్చి మొర్రి ఆలోచనలన్నీ పెట్టుకుంటావు. ఆడది మగాడికి సమానంగా ఎందుకుండకూడదనుకుంటావు. వాదించడం మొదలు పెట్టావు. నీతో వాదించడం నాకు చెడ్డ కష్టంగా ఉంటుంది. అందులోనూ భార్యతో వాదించడమేమిటి. నీవు వాదించడం నాకేమీ బాగుండదని చెప్పాను కదా. కమలా అసలు పుస్తకాలు చదవవద్దని కాదు నేను చెప్పేది. చదువు, కాని ఇటువంటి పుస్తకాలు కాదు. మన ప్రాచీన గ్రంథాలు భారతం, భాగవతం రామాయణం, స్త్రీల వ్రత కథలు వగైరాలు చదువు. అది చదివి ప్రాచీన కాలంనుంచి మనవారు ఎలా ఉంటున్నారో తెలుసుకొని అలా నడుచుకో—"

"మరి మీరు కూడా ప్రాచీన ధర్మాలెందుకు పాటించరు? ఈ పేకాట మాటేమిటి?" అంది కమల చటుక్కున.

"అదుగో మళ్లా అడ్డుప్రశ్న వేసి తికమక పెడుతున్నావు. అదే నా కసహ్యం. నా అలవాట్లు నాతోనే పుట్టి పెరిగాయి. నాతోనే పోతాయి. వాటిని వదలడం ఈనాడు సాధ్యం కాదు. అయినా నాకు డబ్బుంది. అనుభవిస్తాను. నిన్నూ అనుభవించమంటాను. నీకేసుఖభోగాలు కావాలన్నా అవి అన్నీ నీ కుంకుటట్లు చేయడానికి ప్రయత్నం పోయింది. రాజారావు ఆవేళ కమల నేమీ అడగలేదు. మర్నాడు పొద్దున్న ఎక్కడికో ప్రయాణ మవుతూ కమలను పిలిచి "నిన్న ఆవిడ ఎందుకు వచ్చింది?" అని అడిగాడు.

"ఈ వేళ వాళ్లింట్లో వాళ్ల చంటి పిల్లవాడి పుట్టినరోజట పేరంటానికిపిలవడానికి వచ్చింది" అని చెప్పింది కమల.

"వెళ్దామను కుంటున్నావా?"

"అవునండీ మరీమరీ పిలిచింది ఎంతో మంచి ఆవిడ వెళ్ళక పోతే ఏం బాగుంటుంది?" అంది కమల.

రాజారావు ఒక నిమిషమూగి "వెళ్ళవద్దని చెపుతున్నాను. మళ్లీ కారణం అడగకు నేను చెప్పినట్లు వినాలంతే. ఇంతవరకూ మెల్లగానే చెపుతున్నాను నీవు గ్రహించేట్లు లేవు. ఆ యింటితో మనకు సంబంధం ఉండరాదు. వెళ్లితే నేను ఊరుకోను, ఆపైన నీ యిష్టం" అని చెప్పి వెళ్లిపోయాడు.

కమలకు మళ్లీ కోపం పొంగుకు వచ్చింది. ఏమిటీ పెంకితనం? ఎన్నిసార్లైనా కారణం చెప్పక పోవడమేమిటి? తనను పరీక్ష చేయడానికా ఈ ఆజ్ఞ? తను లొంగి ఉంటానో లేదో తెలుసుకోవడానికా? భార్య బానిసగా ఉండాలనే కాదూ పరీక్ష ఉద్దేశ్యం? ఏమైనా సరే ఆవేళ భర్తతో గట్టిగా మాట్లాడి కారణం తెలుసుకొని భర్త చేత ఒప్పించి పేరంటానికి వెళ్ళాలను కుంది కమల. సాయంత్రం పేరంటం సమయమైంది. కాని రాజారావు ఇంటికి తిరిగి రాలేదు. పాపం వరలక్ష్మిగారు తనకోసం కనిపెట్టుకు కూర్చుంటుంది. భర్త రాలేదు వెళ్లడమా మానడమా అన్న గుంజాటన పట్టుకుంది. వెళ్ళకపోతే ఏ మనుకుంటుందో. పాపం ఆవిడ ఎంత మంచి ఆవిడ. ఆవిడ మనస్సు కష్టపెట్టడమా? మరివెళ్తే భర్తఏమంటాడో! ఏం చేస్తాడు? తానిదివరకు అతని కళ్లు జాలికళ్లు అనుకుంది కాని ఈ వేళ అతని కళ్ళలో ఎంత కాఠిన్యం తాండవిస్తోందో చూసింది. ఆ మొగం మీదపడుతున్న జుట్టూ లావు పెదవులే ఇప్పుడెంత భయం కలిగిస్తున్నాయి! కాని తాను ఇంత చదువుకున్నది గౌరవంతో సంఘంలో బ్రతక నేర్చినది ఈ బెదరింపులకు లొంగి పోవలసిందేనా? ఆమెలో పట్టుదలా, అభిమానమూ తిరిగి తలఎత్తాయి నౌకరుచేత బండిని పిలిపించి వరలక్ష్మిగారి ఇంటికి బయలుదేరింది. ★

(ఇంకా ఉంది)

లక్ష్మి: "కమలా! నేను నీతో చెప్పిన మాట సుశీలకు చెప్పొద్దంటే ఎందుకు చెప్పావు?"

కమల: "నేను ఆమెకు చెప్పినట్టు నీతో చెప్పొద్దన్నానే. ఎందుకు చెప్పిందో?"

లక్ష్మి: "సర్లే. ఆమె నాతో చెప్పినట్టు నీతో చెప్పిన సంగతి మళ్ళీ ఆమెతో చెప్పకు."




# పత్రికా రచన

ఇల్లిందల సరస్వతీదేవి

సర్వత్రా వ్యాపించేది సారస్వత మంటారు. కాని నిజానికి సర్వత్రా ప్రసరించేది పత్రికారచన. పత్రికలలోది సారస్వతము కాదని చెప్పటానికి వీలులేదు; కాని పత్రికారచనకూ సారస్వతానికి కొద్ది భేదము ఉన్నది.

పత్రికారచన సారస్వతస్వరూపమే గాని దాని ప్రయోజనము వేరు. ఈ విశాలప్రపంచములో జరుగుతున్న అనంతసృష్టిలో నూతన ఫలితవిధానము, బుద్ధిప్రగతి, అనుభవాలనుగురించి ఎప్పటికప్పుడు ప్రచురించి, ప్రజలకందించేది పత్రిక. మనదేశములో పత్రికారచన ఈ శతాబ్దారంభములో, స్వతంత్రపోరాటం సందర్భమున ఉత్పన్నమయినదనే ప్రవాదము ఉన్నది కాని 19 వ శతాబ్దములోనే పత్రికారచనకు పునాది వేయబడ్డది.

కందుకూరి వీరేశలింగకవికి పూర్వము విద్య, విజ్ఞానము, పండితులైన సాహితీపరులఆధీనములో ఉండేవి. సమస్త వాఙ్మయమూ పండితగ్రాహ్యమైన గ్రాంధిక శైలిలోనే ఉండేది. వాఙ్మయము ఇంచుమించుగా అంతా పద్యరచనలోనే ఉండి, పండితులలోనే వ్యాప్తమయ్యేది. ఆ కాలములో రచనకు పద్యరచన అనే అర్థము చెప్పుకొనేవారు. ఎక్కడైనా ఒకచోట వచనము ఉన్నప్పటికీ, అది పద్యానికి సన్నిహితముగా ఉండేది; పామరజనులకు అభేద్యముగా ఉండేది. స్త్రీలకు పామరులకు ప్రత్యేకముగా గేయవాఙ్మయము సృష్టింపబడ్డది. ఇది కావ్యధోరణిలో నడచినా, స్త్రీలకు పామరులకు ఉచ్చరించటానికి పాడుకోవటానికి అనువయిన శబ్దాలతో, సమాసాలతో రచింపబడేది. అవిద్యావంతులలో విద్యా వైజ్ఞానికో ప్రచారము ఈ గేయాలద్వారా జరిగింది. ఆనాటి ప్రచారసాధనలుగా పాటలు, బుర్రకథలు, యక్షగానాలు, వీధి భాగవతాలు ఉపయోగపడినట్లు తెలుస్తుంది.

19 వ శతాబ్దములో ప్రజాసామాన్యానికి సత్వర విద్యా వైజ్ఞానికాభివృద్ధి కలగటానికి కందుకూరి వీరేశలింగకవి కృషిచేయ తలపెట్టాడు. సాహిత్యము పండితులకే కాకుండా పామరులకు, బాలబాలికలకు స్త్రీ పురుషులకు అందుబాటుగా చేయవలెనని సంకల్పించాడు. సాహిత్యాన్ని సంకుచిత వ్యక్తిత్వము నుండి తప్పించి, ప్రజానీకముపైకి నవ్య సంస్కారవాహినిగా మరల్చాడు. నూతన తరములైన శాస్త్రీయ విజ్ఞానాంశాలను, మహోన్నత భావాలను, సర్వజన సులభముగా వచనరచనలో సాగించిన సంస్కర్త కందుకూరి వీరేశలింగము.

ప్రజలకు సత్వర విద్యావైజ్ఞానికాభివృద్ధి కలిగించటానికి ఏర్పడిన సాధనలలో వార్తాపత్రిక ఒకటి. వార్తలను ప్రచారము చేయటానికి అనువయిన సాధనలుగా దిన, వార, పక్ష, మాసపత్రికలు, రేడియో, తంతివార్తలు, చలనచిత్రాలు, టెలివిజను మొదలైనవి ఈ కాలములో గ్రహించబడ్డాయి. చాలా కాలము వరకూ ఈ కూటమిలో ఒక వార్తాపత్రికే ఉండేది. 15 వ శతాబ్దములో అచ్చుయంత్రము వెలసిన తరువాత క్రమముగా వార పక్ష మాసపత్రికలు ప్రచురింపబడుతూ వచ్చాయి. వీటికొరకు వార్తలను సేకరించేవారు, సంగ్రహించేవారు బయలుదేరారు. వార్తలను సేకరించి పత్రికలకు అందించే సంస్థలు వ్యవస్థీకరింప బడ్డాయి. వార్తలను పరస్పరము అందించుకొనే సంస్థలు కూడా నెలకొల్పబడ్డాయి.

వివిధ విషయాలను, ప్రధానమైన రాజకీయాంశాలను, తాజావార్తలను ఎప్పటికప్పుడు ప్రచురించి ప్రజలకందించే పత్రికలలోది సారస్వతమే కాని కొంతభేదము ఉన్నది. సత్వర ప్రయోజనముగల పత్రికలలో ప్రచురింపబడే వార్తలు—చిన్నయసూరి వ్యాకరణము, అలంకార శాస్త్రము నియమించిన సూత్రాల ననుసరించి అర్ధానుస్వార శకటరేఫలతో రచింపబడితే, అవి పండితులకే గాని పామరులకు అర్థము కావు. వార్తా పత్రిక చేతిలోకి తీసుకోగానే సామాన్య చదువరి కది సులభముగా అర్థమయేటట్లు ఉండాలి. అందుచేత వార్తా పత్రికలలో సామాన్య ప్రజలు మాట్లాడే భాషకు సమీపముగా ఉన్న శైలి—సరళమైన శైలి—తప్ప మరొకటి ఆ ప్రయోజనాన్ని సాధించలేదు. కనుక పత్రికారచన విషయవైశద్య ప్రధానమైనది.

వార్తా పత్రికలలో వార్తలతోపాటు అనేక వైజ్ఞానికాంశాలు మనోరంజకాలైన సాహిత్య స్వరూపాలు ప్రచురింపబడుతూ ఉంటాయి. వచన వాఙ్మయములో ఇంతవరకూ బయలుదేరిన ప్రక్రియా వైవిధ్యములో చరిత్ర, నవల, వ్యాసము విమర్శ, లేఖ, కథానిక, వచన నాటకము అనేవి ఏడని నిర్ణయించబడ్డది. వీటిలో శుద్ధ వ్యావహారిక భాషను అంగీకరించేవి కథలు, వచన నాటకాలు. వీటన్నిటికీ లక్షణాలు, లక్ష్యాలు ప్రత్యేకముగా ఉన్నాయి. పత్రికా రచనకు ఈ ప్రక్రియలు సాధనలుగా పరిగ్రహించబడ్డాయి.

పత్రికా రచనలో వార్తలశాఖలో పని చేసేవారు అతి చురుకుగా, వేగముగా తాజా వార్తలను సేకరించి పత్రికకు ఎప్పటికప్పుడు అందించవలసి ఉంటుంది. వార్తలు నిలవఉండే సరుకు కాదు. ఆ కారణముచేత విలేఖరులు రాత్రి అనక పగలనక తిరిగి వార్తలను సేకరించటానికి పరుగులు పెట్టవలసి వస్తుంది. పత్రికా రచనలో ఈ భాగము తప్ప మిగతా ప్రక్రియలను కాలు కదప నవసరము లేకుండా ఎవరి యింట్లో వారు సాధన చేయటానికి అనువైనవి. వీటిలో కొన్ని దినపత్రికకు, కొన్ని వార పత్రికకు, కొన్ని మాస, పక్ష పత్రికలకు అనువుగా ఉంటాయి. పత్రికలలో దిన పత్రికకు వార్తలతో పాటుగా, వాటి మధ్య, వ్యాసము వలె కనబడే వాక్చిత్రము, కథానిక వలె ఉండే గల్పికలు, నాటకము వలె ఉండే రూపకములు తేలికగా ఉండేవి ప్రచురింపబడటము ఆచారము. వార పత్రికలోను పక్షపత్రిక, మాస పత్రికలలో వాటి కాలపరిమాణానికి తగినట్టుగా తరతమ భేదాలతో వివిధ విషయాలను గురించిన సాహిత్య ప్రక్రియలను ప్రచురించటము జరుగుతున్నది.

ఇతర దేశాలన్నిటిలో అమెరికా పత్రికా రచనలో ముందడుగు వేసింది. మన దేశములో కూడా పత్రికల సంఖ్య నానాటికి పెరుగుదలలోనే ఉన్నది. పత్రికారచన చేసేవారి సంఖ్య కూడా పెరుగుదలలోనే ఉన్నది. ఇతర దేశాలలో, ఈ కాలములో రచనల మీద జీవించేవారు ఎక్కువ. మన దేశములో కూడా రచయితలు, పత్రికారచనలో పాటవము కలిగించుకొన్న కొద్దీ ఆర్థిక లాభమును పొందగలుగుతారు.

ఈనాడు పత్రికా రచనలో కథలు కల్పికలు వాక్చిత్రాలు ప్రముఖ స్థానము ఆక్రమించుకొన్నాయి. మన సాహిత్యములో చిన్న కథ క్రొత్త వస్తువు కాదు. ప్రాచీన కాలములో కూడా, ఆంధ్ర భాషలో పండితులు పద్యములో కథలు చెప్పుకొంటే, పామరులు పాడి మాటలలో చెప్పుకొని ఆనందించే వారు. ఆఖ్యాయిక, కథ, ఖండకథ, పరికథ, కథానిక అని గద్య కావ్యము ఐదు విధములుగా విభజన చేయబడ్డది. కథా వస్తువునుబట్టి దివ్యకథ, దివ్యమానష కథ అనే విభాగము కూడా అగ్ని పురాణములో స్పష్టముగా వివరింపడి ఉన్నదని సాహిత్య వేత్తలు చెప్పుతున్నారు. కల్పిత వృత్తాంతము కలది కథ అనీ, సత్య వృత్తాంతము కలది ఆఖ్యాయిక అని పండితులు కొందరు నిర్వచించారు. ప్రస్తుత కాలములో వీటన్నిటినీ చిన్న కథ క్రింద వ్యవహరిస్తున్నారు. ఆంగ్లభాషా భ్యాసము వల్లను, దాని వత్తిడివల్లను, మన రచయితలు చిన్న కథకు క్రొత్త మెరుగులు పెట్టి పునరుద్ధరించారు. చిన్న కథలు కాంతాసమ్మితాలయిన కావ్యశ్రేణికి చెందినవి కనుక చెప్పదలచిన భావము సూచన మాత్రముగా వ్యక్తీకరించాలి. గాని వాచ్యముగా ఉండకూడదు. చిన్న వస్తువులను భూతద్దము ద్వారా స్పష్టముగాను పెద్దవిగాను చూడగలిగినట్లు, ఒక నిశ్చితమైన ఎత్తుగడ సహాయముతో, సామాన్య దృష్టికి అందని అంశాలను చక్కగా చూపగలుగుతాము. కనుక కథకు ఎత్తుగడ ముఖ్యాంగమనీ, కథావస్తువు ఎవరూ గమనించనిదిగా ఉంటే కథ రమ్యముగా ఉంటుందనీ రచయితలు అనుభవము మీదనే గ్రహించారు

చిన్న కథ అంటే పెద్ద కథనుగానీ నవలను గానీ చిన్నదిగా చేసి రచించినది కాదు. ఇది ఒక ప్రత్యేక రచనా విధానము కలది. చిన్న కథ పరిమిత

పంతులమ్మ ఒక రూపాయి తీసి బల్లమీద పెట్టి 'ఇదేమిటో చెప్పండి చూదాం" అంది.

ముందువరసలో కూర్చున్న ఏడేళ్ళ 'సూక్ష్మబుద్ధి' చటుక్కున లేచి, తొంగి చూచి, "బొరుసు!" అని చెప్పేశాడు.

మయిన పరిహద్దులలో రచయిత దృక్పథముతో ఒక సంఘటనద్వారా కథను తెలుపగలుగుతుంది. కథానికలో ఒక్కటే సంఘటన ఉంటుంది. పాత్రలు దానికి సంబంధించినవే ఉండాలి." సంఘటనకు సంబంధించిన వాతావరణము కల్పింపబడాలి. చిన్నకథ సుదూరముగా సాగిపోకూడదు కనుక కథాంశము సన్నివేశము కళ్లకు కట్టినట్టుగా చిత్రింపబడటము అవసరము. తక్కువ మాటలలో, ఎక్కువ అర్థాన్ని సూచించే శబ్దజాలాన్ని వాడగల నైపుణ్యము కథారచయితలకు ప్రధానమైనది. కావ్యభాషవల్లను, కవిత్వపు చెక్కడములవల్లను, కథకు జీవకళ చెదరిపోతుంది. భావాన్ని వ్యక్తపరచటములోను, తీర్చిదిద్దటములోను కథానికారచన పద్య కవిత్వానికి చేరువలో ఉంటుంది కథా రచయితకు చిత్రకారుడికీ ఎక్కువ వ్యత్యాసము లేదు. చిత్రకారుడు తనకుంగాను రంగులలో ముంచి సుందరమయిన చిత్రాన్ని చిత్రించినట్లే, కథాసన్నివేశాలను సంఘటనలను భావస్ఫోరకముగా, ఆకర్షణీయముగా మనోరంజకముగా చక్కగా కుదింపబడిన పదజాలముతో, నవరసాలను ఒలికిస్తూ రచయిత చిన్నకథను రచిస్తాడు. ప్రకృతి ప్రతిబింబించిన చిత్రము సర్వజనానందకరమైనట్లే, సాంఘిక సత్యముకల చిన్నకథ సకల జనామోదాన్ని పొందకలుగుతుంది.

నిశ్చలముగా ఉన్న సరస్సులో రాయిని విసరి వేసినట్లయితే, దాని తాకిడికి నీటిలో అలల రూపమున సంచలనము బయలుదేరుతుంది. ఈవిధముగానే ఉత్తమకథానిక పాఠకుని హృదయములో జొచ్చి, భావసంచలనాన్ని కలిగించుతుంది. హృదయాన్ని కదలిస్తుంది - మాయని ముద్రలను వేస్తుంది. కథాశిల్పము కంటె కథాప్రయోజనము ముఖ్యమైనది కనుక కథావస్తువు ఉదాత్తమైనదిగా ఉండవలెననీ, రచయితలు ఔచిత్యమును పాటించవలెననీ, విజ్ఞులు అభిప్రాయపడ్డారు.

కథానికలలో పాత్రలసంభాషణ పాత్రోచితినిబట్టీ, మిగతా కథాభాగము తరతను

భేదాలతో గంభీరముగాఉంటే కథ మెట్టుగా ఉంటుంది. కథానికలలో కూడా ఇతివృత్తాన్ని బట్టి శైలీభేదము కనబరచవలసి ఉంటుంది. చారిత్రకమైన ఇతివృత్తము తీసుకుంటే, రమణీయార్థముతోపాటు పదగుంభనముకూడా పాటించవలసి ఉంటుంది. కథానికలలో ఇతివృత్తము, ఎత్తుగడ, కథావిధానము, ముగింపు, ముఖ్యముగాని శైలి అంత ప్రధానము కాదు. చిన్నకథలలో శైలి ఒకసాధనముగా (Vehicle) మాత్రమే ఉపయోగపడుతుంది. కథ చెప్పుతున్నట్లుగా వ్రాయాలనీ, అప్పుడుగాని దాని ప్రయోజనము సాధింపబడదనీ, రచయితలకు అనుభవైకవేద్యము. చెప్పుతున్నట్టుగా వ్రాయబడిన కథానిక గ్రాంథికభాషలో రచింపబడినట్లతే, కృతకముగా ఉంటుంది. రచయిత సంస్కారాన్ని బట్టి కథానికలలో శైలి భేదించటము చూస్తున్నాము. చిన్నకథ ఒలిచిన అరటిపండువలె ఉంటేనే రమ్యముగా ఉంటుంది. నవరస భరితమైన ఈ చిన్న కళాఖండ రసాస్వాదనములో పాఠకుడికి శైలి అడ్డము రాకూడదు. భావోద్వేగానికి అనుగుణమయినదిగా, పండితుల కాకర్షణీయమైనదిగా, పామరులకు అర్థమయ్యేదిగా శైలి వుంటే సకల జనామోదకరముగా ఉంటుంది

కథానికకు ముఖ్యమైన అంగాలు భావము, శైలి, శిల్పము. ఈ మూడింటిలో భావము అనబడే ఇతివృత్తము ప్రధానమయినది. ఈ భావము ఉదాత్తమైనదా—వాస్తవికతకు చెందినదా—దేశకాల పాత్రలకు సంబంధించినదా— విశ్వజనీనమైనదా— అన్న అంశాలు ఎంత ప్రధానమైనవో అంత వివాదాత్మకమయినవి. అవి రచయిత వైయక్తికమయినవి ఇతరులు ఎంత నిర్వచించినా రచయిత తన భావాన్ని తన దృక్పథముతోనే రచింపగలుగుతాడు. కాని దేశకాల పాత్రలకతీతమై, విశ్వజనీనమైన ఇతివృత్తము కల కథానికే చిరస్థాయిగా నిలబడగలుగుతుంది.

ప్రతిదినము సాగిపోయే తూతూలుకొరకు క్రమములో వార్తాపత్రికలు ప్రకటించే గల్పికలు కథానికలవలెనే ఉంటాయి. చాలా తేలికగా చిన్న అంశాన్ని కథారూపములో వ్యక్తీకరించి రచింపబడినవి. ఇవికూడా రసగుళికలే.

వ్యాసమువలె ఉండి ఈనాటి పత్రికారచనలో ప్రముఖస్థానము ఆక్రమించుకొన్నది వాక్చిత్రము (Feature) వాచ్చిత్రానికి వ్యాసానికీ భిన్నభిన్న లక్షణాలు చెప్పబడినా, వాక్చిత్రము దాని సరిహద్దులను దాటి వ్యాసములోకి, వ్యాసము వాక్చిత్రపు సరిహద్దులలోకి వెళ్లుతునే ఉన్నాయి. ఆ కారణముచేత సంకరమైనట్లుగా ఉండటమూ లేదు ఈ రెండూ వార్తలకు సంబంధించని వాటిక్రింద లెక్క. ఈ రెండిటిమధ్య గీతలు గీసి, సరిహద్దులను నియమించటము కష్టమైనపని.

వ్యాసరచనకు గ్రంథపఠనము, అనుభవము ఎక్కువగా కావలసి ఉంటుంది.

# ★ పత్రికా రచన ★

వాక్చిత్ర రచనకు ప్రజాభిరుచి, సమయాను కూలత ఎక్కువగా గమనించతగినవి. వ్యాస రచనలో అంశాలు, అంకెలు, వాటి సంబంధము ఎక్కువగా ఉంటుంది. వ్యాసము గంభీరముగా, ఉద్రేకరహితముగా, పదగుంభనముతో రచింపవచ్చు. వాక్చిత్రరచనకు ఇవి ఉపయోగపడవు. వాక్చిత్రము సామాన్య శైలిలో, ప్రసంగపూర్వకముగా, పాఠకులకు ఆకర్షణీయముగా చిత్రింపబడేది. వ్యాసరచనకూ వాక్చిత్రరచనకూ విషయములో ఎక్కువ తేడాలేదు కాని రచనా విధానములో భేదము ఉన్నది. ఏ విషయాన్నయినా తీసుకొని వ్యాసమూ వ్రాయవచ్చు. వాక్చిత్రమూ వ్రాయవచ్చు కాని – కొన్ని విషయాలు ప్రత్యేకముగా వాక్చిత్రాలలోనే చక్కగా ఇమిడిపోతాయి. వార్తలలో విచిత్రమూ వినోదకరమూ అయిన వాటిని తీసుకొని వాక్చిత్రము రచించవచ్చు. వ్యాసానికి ఇవి ఉపకరించవు. వ్యాసానికి సమగ్ర విషయపరిశీలన, ఒక వాదము, ఒక తీర్పు అవసరము. వ్యాసరచనకు శాస్త్రీయమైన ప్రారంభము, మధ్యభాగము ముగింపు వుంటాయి. వాక్చిత్రములో ఆ సూత్రాలు అంత కఠినముగా పాలింపబడవు. వాక్చిత్రము ఎక్కడనుండి అయినా ఆరంభము కావచ్చు. దాని ముగింపు పాఠకుడికి తెలియకుండానే జరిగిపోతుంది. వాక్చిత్రము దీర్ఘమైన విషయబద్ధమైనది కాదు. సంగ్రహమే వాక్చిత్ర రచనలో గమనించతగిన అంశము. దీర్ఘముగా, శబ్దాడంబరముతో బిగించి, నారికేళ పాకములో వాక్చిత్రాన్ని రచించినట్లయితే అది రాణించదు. ఒక విషయములోని ఒక భావమును (Single mood) మాత్రమే చిత్రించటానికి వీలైనది వాక్చిత్రము. వ్యాసము అనేక అరలూ అంతస్తులూగల మహా భవనమయితే- వాక్చిత్రము, అతి సుందరమయిన నయనానందకరమైన హృదయంగమమైన చక్కని కుటీరమన్నమాట.

వ్యాసము ఉపదేశిస్తే, వాక్చిత్రము వినోదపరుస్తుంది. వ్యాసము ప్రభుసమ్మితమూ, వాక్చిత్రము కాంతా సమ్మితమూను. పరిశీలనానుభవము, విషయసేకరణా చాతుర్యము, రచనా పాటవము వాక్చిత్రకారుడికి కావలసిన లక్షణాలు. ఈ రచయితకు పరనావశ్యకత లేదనుకో కూడదు. మహాపురుషులను గురించిగాని, వారిని సందర్శించిగాని వాక్చిత్రాలను రచించవచ్చు. పండుగలను గురించి వ్రాయవచ్చు. దేవతల యుద్ధాలు పరాశక్తి మహిమలు మొదలైన వాటిని గురించి వ్రాయవచ్చు. దీని పోకడ భావానుకూలమయినది. వాక్చిత్రము కథానికవలెనే ఒక కళాఖండము. దీనిలో నవీన పోకడలు విదేశీయులవద్ద నుండి బయలుదేరినవే. వాక్చిత్రరచనారీతులు స్పష్టముగా నిర్వచించటము కష్టమైన పని. ఆ రచయితలకు పూర్వులు నడచిన బాటలే మార్గదర్శకముగా ఉంటాయి. మార్పులూ మలుపులూ వ్యక్తిగతమైనవి.

సారస్వతానికీ పత్రికా రచనకూ గల వ్యత్యాసాన్ని చక్కగా గమనించినట్లయితే 'ప్రతివాడూ వ్రాసేవాడే' నన్న విచారము బయలుదేరదు. పత్రికా రచనలో ఈ భాగము యథేచ్ఛగా సాగించటానికి అనుకూలమైనది కనుక స్త్రీలు తమ విరామకాలములో ఈ వ్యాసంగము చేయవచ్చు. రచనా పాటవము కళకు చెందినది. కళారాధనవల్ల కలిగే ఆత్మానందము లోకాతీతమైన పరమానందము. 

దక్షత లేని వారి పిల్లల సంరక్షణ చేసే

# నాగేశ్వర శిశువిహార్

ఇంట్లో ఏమున్నా మానినా నిండు కుండల్లె తొణకకుండా ఉండే మధ్య తరగతి కుటుంబాలలో, ఉద్యోగాలు చేయక తప్పనిసరి అయి, పసిపిల్లని పనిపిల్లకో, పొరుగింటివారికో ఒప్పగించి వెళ్ళడానికి మనసొప్పక సతమతమయ్యే స్త్రీల అవస్థను అర్థం చేసుకొని, ఉదయం నుండి సాయంత్రం వరకూ అటువంటి వారి పిల్లలను సముదాయించి, సంరక్షణ చేయడానికై ఆంధ్ర మహిళా సభ (మద్రాసు) నెలకొల్పిన 'నాగేశ్వర శిశువిహార్' భవననిర్మాణానికి డా॥ పట్టాభి సీతారామయ్య, డిసెంబరు 23 న శంకుస్థాపన చేశారు. మద్రాసులోని నాగేశ్వర పురంలో, ఈ భవనం నిర్మించడానికి కావలసిన స్థలాన్ని, ఐదు వేల రూపాయలు నగదునూ, దేశోద్ధారకుని సతి శ్రీమతి కాశీనాథుని రామాయమ్మగారు విరాళం ఇచ్చారు.

"ఈనాడు గ్రంథాలయాలూ, పఠన మందిరాలు నెలకొల్పడం కన్న పేదసాదలకు సేవ, ఉపచారం చేయడం చాలా అవసరం. శ్రీమతి రామాయమ్మగారు ఈ సేవాసంస్థకై స్థలంతోపాటు, భవన నిర్మాణానికి ఐదు వేలు నగదు కూడా విరాళం ఇవ్వడం ముదావహం" అని డా॥ పట్టాభి అన్నారు.

"స్వర్గీయ నాగేశ్వరరావు పంతులుగారు ఎన్నో సత్కార్యాలకు అండగా నిలచి ఉదారంగా సహాయం చేశారు. కుడిచేయి ఇచ్చినదేదో ఎడమ చేయికి తెలియకుండా గుప్తదానాలు చేసిన ఉదార హృదయుడు. ఈ సేవాసంస్థ కోసమే అన్నట్లుగా ఇక్కడ ఈ ఒక స్థలం ఖాళీగా ఉండడం ఆయన సంకల్పబలమే కాబోలు" అని డా॥ పట్టాభి జోహార్లర్పించారు. శంకుస్థాపనోత్సవ సభకు మద్రాసు మేయరు శ్రీ వి. ఆర్. రామనాథ అయ్యర్ అధ్యక్షత వహించారు. కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ సి. డి. దేశముఖ్, ఆంధ్ర మహిళా సభ వ్యవస్థాపకురాలు, కేంద్ర సంక్షేమ సంఘ అధ్యక్షురాలు అయిన శ్రీమతి దుర్గాబాయ్ దేశముఖ్, ఆంధ్ర ప్రజాపార్టీ అధ్యక్షుడు శ్రీ తెన్నేటి విశ్వనాథం, శ్రీ డి. ఎస్. శాస్త్రి, శ్రీ రామనాథ గోయెంకా శ్రీ ఎస్. శంభుప్రసాద్ ప్రభృతులు, తదితర పురప్రముఖులు హాజరయ్యారు.

ఈ శిశువిహార్ పిల్లలుగల మధ్య తరగతి స్త్రీలకు సహాయం చేయడానికి నెలకొన్నది. వేడినీళ్ళకి చన్నీళ్ళు తోడన్నట్లుగా ఉద్యోగాలకు వెళ్ళవలసి వచ్చే మహిళలలో పిల్లలు గలవారు అటు ఉద్యోగం, ఇటు పసిపిల్లల్నీ మానుకోలేక సతమతమవుతూ ఉన్నారు. అందులోనూ ఇంట్లో పెద్ద దక్షత లేని వారి అవస్థలు చెప్పనక్కర లేదు. అటు ఉద్యోగం వదులుకునే స్తోమత లేదు. ఇటు రెండేళ్ళ పసికూనని, పనిపిల్లకో పొరుగింటి పిన్నిగారికో ఒప్పగించి వెళ్ళాల్సి వస్తుంది. పనిలో ఉన్నంతసేపు, ఇంటి దగ్గర పసికూన ఎలా ఉందో అని మనసు గిజగిజలాడుతూ ఉంటుంది. పిల్ల పక్క పెట్టి ఏడుస్తూ ఉంటే, పనిపిల్ల చింతపిక్కలాడుకుంటోందేమో. పొరుగింటి పిన్నిగారు కునుకు తీసే వేళ, పిల్ల వీధిలోకి పాకి వెళ్ళిపోతుందేమో అని పరిపరి విధాల తహతహలాడుతుంది. అటు పిల్లని వదలి రావడానికి మనసొప్పదు. పోనీ కూడా తీసుకుపోదాం అంటే వీలు కాదు.

ఇంట బియ్యపుగింజా బొగ్గుముక్కా నిండుకున్నా నిండు కుండల్లె, నిండుగా, గుంభనగా ఉండగలిగే మధ్యతరగతి కుటుంబాల అవస్థలు చటుక్కున తెలియవు. శిశు సంక్షేమం పేరిట మరి పేదవారి పసిపిల్లలకు, అనేక సేవాసంస్థలు ఉచితంగా పాలు సరఫరా చేస్తున్నాయి. ప్రభుత్వం మందూ మాకూ ఇప్పిస్తున్నది.

మధ్యతరగతి కుటుంబాలలో పడే ఈ రకం అవస్థను నివారించడానికి ఏమంత కృషి జరుగలేదు. మద్రాసులోని ఆంధ్ర మహిళా సభ కొంతకాలంగా ఈ విషయమై శ్రద్ధగా ఆలోచిస్తూ వచ్చారు.

దేశోద్ధారకుడు కాశీనాథుని నాగేశ్వరరావు గారి సతి శ్రీమతి రామాయమ్మగారితో మహిళా సభ నిర్వాహకులు ఈ విషయం ప్రస్తావించి సహాయం కోరగానే ఆమె సంతోషంతో అంగీకరించి నాగేశ్వరపురంలో (ఆంధ్రమహిళా సభకు చేరువలోనే) ఉన్న ఒక స్థలాన్ని, (ఒకటి ముప్పాతిక గ్రౌండ్లు) అక్కడ శిశువిహార్ నిర్మించడానికి ఐదు వేల రూపాయలు నగదూ విరాళం ఇచ్చారు.

వెంటనే ఆంధ్రమహిళా సభ, ఇందుకు సన్నాహాలు ప్రారంభించింది. వారి కోరికపై మద్రాసు సాంఘిక సేవా శిక్షణ కేంద్రం, సేవాసమితి (గిల్డ్ ఆఫ్ సర్వీస్) మైలాపూరు, మాంబళం అనే రెండు పేటలలో నివసించే మధ్యతరగతి కుటుంబాల గురించిన సమగ్రవివరాలు సేకరించారు. 54 మంది పసిపిల్లల పేర్లు ఇవ్వబడ్డాయి. ప్రస్తుతానికి ఇక్కడ 25 మంది పిల్లలను చేర్చుకోవాలని నిశ్చయించారు. ఈ పిల్లలను, ఉదయం తల్లి పనిలోకి వెళ్ళినప్పటినుండి, సాయంత్రం తిరిగివచ్చేవరకూ సంరక్షిస్తారు.

ఈ సౌకర్యం మధ్య తరగతి కుటుంబాలకూ, బాగా స్వల్పాదాయం గల కుటుంబాలకూ మాత్రమే ఉంటుంది. తల్లులు ఉద్యోగం చేస్తూ ఉన్నప్పుడే పిల్లలను ఇక్కడ ఒప్పగించాలి. ఇక్కడ ఉన్నంతసేపు పిల్లలకు వేళకు పాలుపట్టడం, నిద్రపుచ్చడం ఆడించడం మొదలయిన విధాల వాళ్లు బెంగపెట్టుకోకుండా చూస్తారు. ఆ సంరక్షణ అంతా శాస్త్రీయ పద్ధతులలో శుభ్రంగా జరుగుతుంది. సాయంత్రం ఆఫీసునుండి తిరిగివచ్చే వరకూ తల్లి నిశ్చింతగా ఉండవచ్చును. ఈ శిశువిహార్‌లో పిల్లల పోషణలో శిక్షణపొందిన ఒక నర్సును, నర్సరీబడులలో శిక్షణ పొందిన మరొక మహిళను నియమిస్తారు. శ్రీమతి కె. రంగనాయకమ్మగారు ఈ కేంద్ర నిర్వహణకు బాధ్యత వహిస్తారు.

ఆంధ్ర మహిళా సభ వివరాలన్నీ సేకరించి, నియమ నిబంధనలన్నీ రూపొందించేలోగా, కేంద్ర సమాజ సంక్షేమ సంఘం, ఈ సభకు రు 15 వేలు మంజూరు చేశారు. మహిళాసభ వారు ఇందులో పది వేల రూపాయలను ఈ శిశువిహార్‌కు కేటాయించ నిశ్చయించుకున్నారు. ఇందులో ఐదు వేలు, శ్రీమతి రామాయమ్మ గారిచ్చిన స్థలంలో భవనం కట్టడానికి వినియోగిస్తారు. మరో ఐదు వేలు ఇక్కడ అమర్చవలసిన సరంజామా కొనడానికీ, కేంద్రం నిర్వహణకు వినియోగిస్తారు.






# కాశీ అన్నపూర్ణ

సి. విశ్వనాథం

పూర్వము ఒకానొక రోజున రాత్రి సమయంలో కాశీ రైలుస్టేషనుకు అప్పుడే రైలు వచ్చి ఆగింది. జనం గుంపులు గుంపులుగా స్టేషను దాటి కొందరు కార్లలోను మరికొందరు టాంగాలలోను ఎక్కి వెళ్తున్నారు. ఈ రెండు వాహనాలను అధిరోహించటానికి ఆర్థికబలం లేనివారు నడిచి వెళ్తున్నారు.

ఒక వ్యక్తి స్టేషను దాటి కాలిబాటపైకి వచ్చాడు. అతని తల మీద పెద్దమూటఉంది. కుడి చేతిలో సంచి ఒకటి వ్రేలాడుతోంది. నీరు కావిపంచ కట్టుకొన్నాడు. అటువంటిదే చొక్కా ధరించాడు. అతని ముఖంలో ప్రశాంతమైన తేజస్సు ఉంది. నడవలేక నడుస్తూ ఆ కాలిబాట వెంబడే వెళ్తున్నాడు. సందులు గొందులు దాటి అన్నపూర్ణ సత్రం చేరుకొన్నాడు.

అప్పుడే సత్రంలోని గడియారం పదిగంటలు కొట్టింది. సత్రంవుద్యోగస్థులు సామానులన్నీ ఎక్కడివక్కడ సర్దేసి తలుపులు మూసి తాళాలు బిగించి యిండ్లకు వెళుతున్నారు. అప్పుడే మన వ్యక్తి చీడీలెక్కి సత్రంఉద్యోగస్థులకు ఎదురు వచ్చాడు.

"ఎవ్వరు నీవు?" అన్నాడు సత్రంగుమాస్తా అధికారస్వరంతో.

"దక్షిణ ప్రాంతాన్నుండి వస్తున్నాను బాబూ! ఇప్పుడు రైలు దిగాను. నాలుగురోజులుగా రైలులో నలిగి వచ్చాను. మీ సత్రంలో కాస్త ఆశ్రయమియ్యండి" అన్నాడు ఆ వ్యక్తి. "నీ పేరు?" "సత్యనారాయణ అంటారు" అన్నాడు ఆవ్యక్తి వినయంగా. "అట్లాగా. పది దాటితే యీ సత్రంలో అన్నం పెట్టరు. రేపు ఉదయానికే!" అన్నాడు గుమాస్తా. "బాబు! బాబు! నాలుగు రోజులుగా రైలులో సరియైన తిండి లేదు. ఏవో తినుబండారాలు కొనుక్కొని పొట్టనింపుకొన్నాను. ఇపుడు స్టేషనునుండి నడిచివచ్చాను. చాలా ఆకలిగా వుంది. భోజనం పెట్టండి. ఇంతరాత్రివేళ మరెక్కడికి పోను? చాలా నీరసంగా ఉన్నాను" అన్నాడు సత్యనారాయణ చాలా దీనంగా.

"పది దాటితే యిక్కడ అన్నం పెట్టరని చెప్పలా! అంగటికొట్లో ఏ మిఠాయో కొనుక్కొని అదిగో ఆ మూలగా చాప పరుచుకొనిపడుకో యీరాత్రికి" అని సత్రంగుమాస్తా నిర్దయగా చెప్పి తాళం చేతులు గలగల లాడించుకుంటూ అక్కడినుండి నిష్క్రమించాడు.

సత్యనారాయణ ఏమీ చేయలేక సత్రపులో ఓమూలగా చాప పరుచుకొని సత్రపుగుమాస్తా పెట్టిన మడత కుడుములతో కాళ్లు ముడుచుకొని పడుకొన్నాడు.

సత్రంలోని ఇతర యాత్రీకులంతా నిద్రాదేవి ఒడిలో మైమరచి పడుకొన్నారు. సత్రమంతా నిశ్శబ్దాన్ని జపిస్తోంది. దూరంగా ఎక్కడో కుక్కల మొరుగులు అప్పుడప్పుడు 'కయ్యి కయ్యి'మని వినిపిస్తున్నాయి. సత్యనారాయణకు ఎంతకీ నిద్రపట్టటం లేదు. ఔను! ఎందుకు పడుతుందీ? ఒకచెంప ఆకలి ప్రేగుల గోల, మరోచెంప ప్రయాణపు బడలిక! బాగా నలిగివున్నాడు. చాపమీద అటునుంచి యిటూ యిటునుంచి అటూ తెగదొర్లుతున్నాడు. నిద్రాదేవి కటాక్షించటం లేదు పాపం!

సత్రంలోని గడియారం పన్నెండు గంటలు కొట్టింది. "అబ్బా! అప్పుడే పన్నెండు గంటలు అయిందా! అయ్యో! ఆకలి దహించి వేస్తోందే! తల్లీ అన్నపూర్ణాదేవీ! యీ దీనునిపై యింత అలకేల తల్లీ! నీవు నివసిస్తున్న యీ కాశీక్షేత్రంలో ఒక జీవి ఆకలితో మాడవలసిందేనా? ఎన్ని బాధలనైనా సహించవచ్చుగాని ఆకలిబాధ సహించలేముగదా! తల్లీ కరుణించు!" సత్యనారాయణ లోలోపల బాధపడుతూ అన్నపూర్ణాదేవి ఆలయంకేసి ఓ నమస్కారం పెట్టి సంచీలో ఉత్తరీయం తీసి కప్పుకొని పడుకొన్నాడు.

సత్యనారాయణకు అప్పుడే మాగన్నుగా నిద్రపడుతోంది. ఆ సమయంలోనే ఎవరిదో చల్లని చెయ్యి తట్టి లేపింది. సత్యనారాయణ ఉలిక్కిపడి లేచాడు. సత్రవులోని దీపం మిణుకు మిణుకుమంటూ గుడ్డిగా వెలుగుతోంది. ఆ గుడ్డి వెలుగులో అతడు కళ్లు నులుముకుంటూ చూచాడు.

తెల్లటిచీర తెల్లటి రవిక తొడుగుకొని బంగారు ఆభరణాలు ధగధగా మెరుస్తూవుండగా నుదుట పెద్ద కుంకుమ బొట్టుతో చిరునవ్వు నవ్వుతూ ఓ ముత్తైదువ ఎట్టఎదుట నుంచునివుంది. ఆ గుడ్డి వెలుగులో ఆమెను పూర్తిగా గుర్తుపట్ట సలవికాకుండా వుంది. కాని ఆ ముత్తైదువ చుట్టూ ఏదో తెల్లటి కాంతి పుంజము అలుముకొనిఉంది.

"ఎందుకు తల్లీ లేపావు?" అన్నాడు సత్యనారాయణ ఆశ్చర్యంగా ఆ ముత్తైదువవంక చూస్తూ. "రా! నాయనా! అన్నం పెడతా! చాలా ఆకలిగా వున్నట్టున్నావు" అన్నది ఆ ముత్తైదువ చాలా ఆదరంగా. సత్యనారాయణ మారు మాట్లాడకుండా ఆమెను అనుసరించాడు.

ముత్తైదువ సత్రం తాళాలు తెరిచి, వంటగదిలోకి తీసుకువెళ్ళి విస్తట్లో పంచభక్ష పరమాన్నాలు వడ్డించింది. సత్యనారాయణ ఆత్రంగా విస్తరిముందు కూర్చుని అన్నీ భోంచెయ్యడం ప్రారంభించాడు. ముత్తైదువు చిరునవ్వుతో యిది అంతా గమనిస్తూ అతనికి యిష్టమైనపదార్థాలు ఆప్యాయంగా మరల మరల వడ్డించసాగింది. సత్యనారాయణ సంతోషంతో అన్నీ ఆఖరుచేసి 'బ్రేవ్'మని పొట్ట నిమురుకుంటూ విస్తరి దగ్గరనుండి లేచాడు.

"ఆకలి ప్రేగులు చల్లార్చావు తల్లీ! అన్నపూర్ణమ్మ తల్లినిమించిన చల్లని తల్లివి" అని స్తోత్రంచేస్తూ లేచి చెయ్యికడుగుకున్నాడు. షడ్రసోపేతంగా భోజనం చెయ్యటం వల్ల ఆ సంతోషంలో ఆమె ఎవరో కనుక్కోవడం మరిచాడు. మామూలు చోటులోకి వెళ్లి పడుకొని గుర్రుపెట్ట సాగినాడు.

తెల్లగా తెల్లవారింది. కాకులు కావుకావుమని రొదచేస్తున్నాయి. బజార్లలో జనం నడిచే సందడి; దేవాలయంలో గుడిగంటల గణగణలు. భక్తుల "హరహర మహాదేవ్!" అన్న అరుపులు వినవస్తున్నాయి. సత్యనారాయణ ఇంకా గుర్రు పెడుతూనే వున్నాడు.

సత్రం ఉద్యోగస్థులు వచ్చి సత్రం తలుపులు తెరిచి ఎవరి పనులలో వాళ్లు నిమగ్నులయ్యారు. అన్నం వండేవారు అన్నం వండుతున్నారు. కూరలు తరిగేవారు కూరలు తరుగుతున్నారు. ఎవరి హడావుడిలో వాళ్లు మునిగిపోయారు.

వంట చేస్తున్న అతనికి ఏదో కావలసివచ్చి గూటిదగ్గరికి వెళ్ళగా ధగధగా మెరుస్తూ ముక్కెర కంట

"ఎవడండీ వాడు ఆమూల ఉన్నవాడు? అంత భయంకరంగా ఉన్నాడు?"

"వాడు మా అన్నయ్యే నండి."

"అలాగా. మన్నించాలి. పోలికలు గమనించలేదు."

### అతనికంటె ఘనుడు

మహాధాటీగా కోతలు కోసేస్తోన్న ఒక గోవిందరావు ఒక పులికథ చెప్పాడు:

"సరిగ్గా అప్పుడు నేను చెరువులో పీకెలోతు నీటిలో నిల్చొని ఉన్నాను. పులిగాండ్రుమని గర్జిస్తూ ముందుకు వస్తోంది. నేను వెంటనే దోసిళ్ళతో నీళ్ళెత్తి దాని కళ్ళ నిండా కొట్టాను. అంతే అలా వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది."

శ్రోతల మధ్య కూర్చున్న ఒక పైకోతల పాపారావు తొణక్కుండా తరువాయి కథ చెప్పాడు,

"గోవిందరావుగారు చెప్పిందంతా నిజమే. ఎందుకంటే, అప్పుడే ఆ దారిన వెళ్తూ ఆ పులిని చూసి మొహం తడిమాను. ఆ పులిమీసాలు తడి తడిగా ఉన్నాయి!"

రెండో ఆట సినిమాకి వెళ్లి కులాసాగా ఇంటికెళ్తున్న ఒక పెద్దమనిషిని ఇద్దరు ఆసాములు పలకరించి, ఓ కాని ఉంటే ఇమ్మన్నారు.

పెద్దమనిషి కొద్దిగా కంగారుపడి, నవ్వి, "కాని ఎందుకు?" అన్నాడు.

"ఏం లేదు. చూశారూ. ఇప్పుడు మిమ్మల్ని మెత్తగా చితక్కొడతాం. తరవాత మీ పర్సు, వాచీలలో నేనేం తీసుకోవాలి, మా నేస్తం ఏం తీసుకోవాలి అన్న సంగతి బొమ్మబొరుసు వేసి ముందుగానే తేల్చుకుందాము" అన్నాడొక దొంగ.

బక్షది. వాడు ఆశ్చర్యచకితుడైనాడు. ఇది యిక్కడికి ఎట్లా వచ్చింది? ఇది ఎవరిది? అన్న సందేహాలు ముప్పిరిగొన్నాయి అతనిని. దానిని చేతబట్టి మేనేజరు దగ్గరకు తీసుకు వెళ్లాడు.

సత్రం మేనేజరుకు ఆ ముక్కెరను చూడగానే మూర్ఛవచ్చినంత పనయింది. ఆ ముక్కెర అమ్మవారిది. యిది సత్రంలోకి ఎట్లా వచ్చింది. గుమాస్తాను పిలిచి అడిగాడు. "రాత్రి ఎవరో వ్యక్తి అన్నం పెట్టమని సత్రంలోకి వచ్చాడు. పది దాటింది, ఆ భోజనం పెట్టటానికి వీలు లేదు! అన్నాను. అది విని అతడు దిగులుగా సత్రం అరుగుమీద పడుకొన్నాడు. అతనే ఎత్తుకు వచ్చాడేమో?" అన్నాడు గుమాస్తా. "ఆ! అట్లాగా ఏడీ? అతన్ని పిలుచుకు రా!" అన్నాడు మేనేజరు ఆశ్చర్యంగా. గుమాస్తా పరుగు పరుగున వెల్లి సత్యనారాయణను లేపాడు. సత్యనారాయణ అప్పటికి నిద్రపోతూనే ఉన్నాడు. గుమాస్తా పిలుపుకి ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు. "దేనికయ్యా లేపావ్?" అన్నాడు సత్యనారాయణ నిద్రకళ్లు నులుముకొంటూ. "రా! రా! మేనేజరుగారు పిలుస్తున్నారు" అన్నాడు గుమాస్తా తొందర చేస్తూ. "ఎందుకూ?" అన్నాడు సత్యనారాయణ విసుగుతో. "ఏముంది త్వరగా రా!" అంటూ తొందరపెట్టి లాక్కెళ్లాడు గుమాస్తా.

మేనేజరు సత్యనారాయణను చూస్తూనే "ఎవరు నీవు? ఏ వూరు నీది? ఎందుకు వచ్చావ్?" అని ప్రశ్నలవర్షం కురిపించాడు. "అయ్యా! నాది దక్షిణ దేశం. యాత్రలు చేసుకుంటూ యీలా వచ్చాను" అన్నాడు సత్యనారాయణ వినయంగా. "అట్లాగా! సరే గాని యీ ముక్కెర అమ్మవారిది. సత్రంగూట్లోకి ఎట్లా వచ్చింది? నీవుగాని ఎత్తుకొచ్చి పెట్టావా? నిజం చెప్పు. లేకపోతే రాజభటులకు అప్పగిస్తా జాగ్రత్త!" అని గర్జించాడు మేనేజరు. "అదేమో నాకు తెలియదండీ! స్టేషనునుండి రాత్రి పది గంటలవేళ సత్రం చేరాను. గుమాస్తాగారు తలుపులు వేసుకొని యింటికి వెడుతున్నారు. భోజనం పెట్టమన్నాను. వారు నిర్దయగా పది దాటింది, వీలు లేదు వెళ్ళిపొమ్మన్నారు. నేను ఉసూరుమంటూ సత్రం అరుగుమీద నిద్రపోతున్నాను. అర్ధరాత్రి ఎవరో తట్టి లేపారు. ఎవరా అని కళ్లు నులుముకుంటూ లేచి చూచాను. వెలుతురు సరిగా లేక మొహం గుర్తు తెలియలేదు. పండుముత్తైదువు నా ఎట్టెదుట నుంచునివుంది. చుట్టూ ఏదో తెల్లటికాంతి ప్రసరిస్తోంది. ఆమె నన్ను చూచి "రా! నాయనా!

అన్నం పెడతాను చాలా ఆకలితో వున్నావు" అని ఆదరంగా అంది. నేను మారుమాట్లాడకుండా ఆమెను వెంబడించాను. సత్రం తాళాలు తెరిచి వంటగదిలోకి తీసుకువెళ్ళి పిండివంటలతో కడుపునిండా అన్నం పెట్టింది. అది తిని పడుకున్నాను. ఆతరువాత ఏమి జరిగిందీ నాకు తెలియదు" అన్నాడు సత్యనారాయణ.

మేనేజరు ఆశ్చర్యపోయాడు. కొంతసేపు అట్టే కూర్చుండిపోయాడు. చాలాసేపటికి తేరుకొని "తాము నిర్దయగా పదిదాటిందనే నెపంతో వెళ్ళిపొమ్మనటంవల్ల అమ్మవారికి యీ భక్తునిపై దయ కలిగి అమ్మవారే రాత్రి యితనికి భోజనంపెట్టింది. అందుకు గుర్తుగాను తమకు బుద్ధి చెప్పటానికిగాను యీ ముక్కెర గూట్లో పెట్టి వెళ్ళింది. మొదట అది గుర్తించలేక యీ భక్తునిపై అనుమానపడ్డాము. ఎంత పొరపాటు!" అన్నాడు. మనస్సులో పశ్చాత్తాపపడి "అయ్యా! నీవు అదృష్టవంతుడివి. రాత్రి మీకు సాక్షాత్తు ఆ అన్నపూర్ణాదేవే భోజనం పెట్టింది. అన్నపూర్ణాదేవి దర్శన భాగ్యం లభించిన నీవు పుణ్యపురుషుడివి. ఇటువంటి అదృష్టం ఎవరికో గాని లభించదు" అని పొగడి, అతను ఉన్న పది రోజులు సర్వసౌకర్యాలు కలగచేశాడు.

ఇది జరిగినప్పటినుండి కాశీ అన్నపూర్ణాదేవికి ఆగ్రహం కలుగకుండా యాత్రికులు ఎంత అర్ధరాత్రి సమయంలో వచ్చినా ఆమె పేరు సార్థకంచేస్తూ భోజన సదుపాయాలు కలుగజేస్తారు!



# చిక్కడు - ముక్కడు

గన్నవరమనే గ్రామంలో
ఉన్నాడొక గజదొంగ
నక్కచిక్కు లెఱుగు నతడు!
చిక్కడతని పేరు.

అతడు గజదొంగ కాని
అతని నెవరు పట్టలేరు!
అది కారణముగ నాతడు
అధిక గర్వియై పోయెను!

చిక్కని పొరుగింటివాడు
ముక్కడనే మఱొక దొంగ!
ఒక్కనాడు చిక్కనితో
ముక్కడిట్లు పంతమాడె:

"గర్వింపకు! చిక్కా! నీ
సర్వస్వము దొంగిలింతు!
ఒక్క ఏడు గడువి"మ్మనె;
ఒప్పుకొనెను చిక్కడు!

చిక్కని సంపద దోచగ
ముక్క డెదురుచూచు చుండె!
గడచిపోయె పది నెలలు!
గడువు చేరువ పడుచుండె!

తన అనేక పాప నివా
రణమునకై కాశి కేగ
సంకల్పించిన చిక్కడు
సర్వధనము మూటగట్టి—

అపుడు రైళ్లు లేవు కనుక
అతడు నడచిపోవుచుండె;
అంతకు ముందే ముక్కడు
వింతగా అదృశ్యుడాయె!

నడువగా, నడువగా చి
క్కడు పోయెడు బాటమీద—
పిచ్చివాడు తన్నుచుండె
పెద్ద చంద్రహార మొకటి!

"బంగరు విలువలు తెలియని
వాడీ వెట్టివా" డనుచు—
"అట్టివాడు తోడుండుట
గట్టిగ ఉపయోగ" మనుచు—

చిక్కడు తనతో వానిని
చక్కగ నడిపించు చుండె!
మూట - పిచ్చివాని కొసగి
నాటిరాత్రి నిద్రించిన

చిక్కడు - వేకువనె లేచి,
దిక్కుఱదుర రోదించెను!!
ముక్కడె ఆ పిచ్చివాడు
చిక్క డెఱుగజాలడాయె!!

రచన: వజ్రపాణి

బాలసాహిత్య సీరియల్ ......

# మార్టిన్ రాట్లర్

మూలం: ఆర్. ఎమ్. బాలన్‌టైన్

## 22

త్వరలోనే మార్టిన్, బార్నీ గనులప్రాంతాన్ని వదిలి బ్రెజిల్ రాజధాని రియో డి జనీరో నగరానికి బయలుదేరారు. బార్నీ తన దగ్గరున్న డబ్బంతా ఖర్చుపెట్టి రెండు మంచిగుర్రాలు కొన్నాడు. చెరొక దానిమీద, ఎక్కి హుటాహుటిగా ప్రయాణం సాగించారు. కష్టాలన్నీ గడిచి గట్టెక్కామన్న సంతోషం, త్వరలో స్వదేశానికి వెళ్లిపోవచ్చునన్న సంతోషం కలిసి వారికి ఎంతో ధైర్యం, ఉత్సాహం కలిగించాయి. మార్గాయాసాన్ని లెక్కచేయకుండా గుర్రాలను అతివేగంగా పరిగెత్తించారు. కొంత దూరం ఆరు బయలుస్థలాల్లోను, మరి కొంతదూరం దట్టమైన అరణ్యాల్లోను ప్రయాణం చేశారు. ఒక రోజున వారు విశ్రాంతికోసం ఒకచోట ఆగారు. గుర్రాల్ని చెట్లకు కట్టివేసి మంచినీటికోసం అన్వేషిస్తున్నారు. బార్నీ హఠాత్తుగా "మార్టిన్! చూడు చూడు" అని కేకవేశాడు. మార్టిన్ దగ్గిరికి పరుగెత్తి వెళ్లి చూశాడు. ఎదురుగా ఒకమానవ మృతకళేబరం ఉన్నది. పరిశీలనగా చూడగా ఆమనిషి ఆ రోజున తనకు గుర్రం కావాలంటూ వచ్చి అడిగినవాడేనని తేలింది. అతడు హత్యచేయబడలేదనడానికి నిదర్శనంగా అతని భోజనపదార్థాలు, ఏవో సామానుసంచులు భద్రంగానే ఉన్నాయి. ఏదో రోగం వచ్చి దారిలో చనిపోయి ఉంటాడనుకున్నారు.

అతనివద్ద ఒక చిన్నతోలుసంచీ ఉన్నది. అందులో బోలెడు బంగారపుపొడి వున్నది. మరొక చిన్నసంచిలో చిన్నచిన్న వజ్రాలు ఉన్నాయి.

"చూశావా బార్నీ! ఆరోజున వీడు ఎందుకంత తొందరపడ్డాడో తెలిసిందా? ఇవి ఎక్కడో దొంగచాటుగా చేజిక్కించుకుని, పట్టుబడకుండా పారిపోవాలనుకున్నాడు. కాని పాపం మృత్యువుకు దొరక్కుండా తప్పించుకోలేకపోయాడు," అన్నాడు మార్టిన్.

"అవును. నిజమే. కాని దొంగైతేనేం, వీణ్ణి ఎక్కడో అక్కడ పాతిపెట్టి మరీ పోదాం. దొంగా మనిషేగదా?" అన్నాడు బార్నీ.

ఇద్దరూ కలిసి ఒక చిన్నగొయ్యితవ్వి అందులో ఆ నిర్భాగ్యుణ్ణి పాతిపెట్టారు.

కొంతసేపు ఆగి, సేదదీర్చుకుని తిరిగిప్రయాణం సాగించారు. అలా చాల రోజులు గడిచాయి. చివరికి ఎలాగైతేనేం రియోడిజనీరో చేరారు.

అక్కడ గని యజమానిని కలుసుకుని బార్నీ తనతో తెచ్చిన వజ్రాలను యజమానికి అప్పగిం

అనువాదం: నండూరి రామమోహనరావు

చేశాడు. యజమాని అతని కివ్వవలసిన జీతం డబ్బులు అతని.కిచ్చేశాడు. దోవలో మృతునివద్దనుండి తీసుకున్న వజ్రాలు, బంగారం ఎవరివైనవీ తెలియనందున వాటినికూడా యజమాని కొనేసి, సరియైనధరను ముట్ట జెప్పాడు. ఆఖరికి స్వదేశానికి పోతున్న నౌకలో ఎక్కి ఇరువురూ లెక్కచూసుకోగా, చెరొక నాలుగువందల పౌనులూ ఆర్జించినట్లు తేలింది.

నౌక హార్బరునుంచి బయలుదేరింది. అంతకంతకూ దూరమైపోతున్న దక్షిణ అమెరికా తీరాన్ని తదేకంగా చూస్తూ, గడిచిన రెండేళ్ళలోనూ అక్కడ తామనుభవించిన కష్టసుఖాలనూ, చూసిన వింత దృశ్యాలను, మనుషులను నెమరువేసుకుంటూ గంభీరాలోచనలలో మునిగిపోయారు.

## 23

బ్రిటన్ రేవుపట్టణంలో తన కార్యాలయంలో కూర్చుని ఆర్థర్ జాలీబోయ్‌గారు గుమాస్తాతో తన వర్తకానికి సంబంధించిన వ్యవహారాలు చర్చిస్తూ ఆందోళనలో ఉన్నాడు.

వారి చర్చలకు అంతరాయం కలిగిస్తూ, తలుపు గభాలున తెరుచుకుంది. మార్టిన్ రాట్లర్ లోనికి ప్రవేశించాడు. అతనివెనుక బార్నీ ఓఫ్లానగన్ వచ్చాడు.

"మీరు రావలసింది ఇక్కడికి కాదు. మాపెద్ద గుమాస్తా గది ఆవేపు ఉంది. ఏమన్నా పని ఉంటే అక్కడికి పొండి,"అని చిరునవ్వు నవ్వుతూ జాలీబోయ్ వారితో అన్నాడు.

"మాకు మీతోనే పని ఉంది. మీతోనే మాట్లాడాలి" అన్నాడు మార్టిన్.

"అలాగా. సంతోషం. రండి. కూర్చోండి. మిమ్మల్ని ఇదివర కెక్కడో చూసినట్లుందే" అని బార్నీవంక చూస్తూ ఆయన అన్నాడు.

"నే నిదివరకు మీ నౌకల్లో పనిచేశానండి. నేను బార్నీ ఓఫ్లానగన్‌ని."

"అలాగా, నువ్వటోయ్. ఈమధ్య కనిపించడం లేదు. ఏదన్నా దూరదేశం వెళ్లావా?"

"అవునండి. బ్రెజిల్ దేశంలో ఉన్నాను ఇంతకాలమూ. నేను ప్రయాణంచేసిన ఖద్యోత నౌక దక్షిణ అమెరికాతీరంవద్ద మునిగిపోయింది."

"అవునవును. జ్ఞాపకం వచ్చింది. మరి ఈ అబ్బాయి ఎవరూ? నీతోకూడా వచ్చినవాడా?"

"అవునండి"అని మార్టిన్ సమాధానమిచ్చాడు. "నేను మీకు తెలిసినవాణ్ణే. ఇదివరలో నన్ను మీరు చూశారు. కాస్త నిదానించి చూడండి, తెలుస్తుంది."

"నీపేరు చెప్పు ఆయనకి మార్టిన్!"అని బార్నీ తొందరచేశాడు.

"మార్టిన్?"అని ఉలిక్కిపడి లేచి నుంచున్నాడు వృద్ధుడైన జాలీబోయ్. మార్టిన్ రెండు బుజాలు పట్టుకుని మొహంలోకి చూస్తూ "మార్టిన్! మార్టిన్! నువ్వు మార్టిన్ రాట్లర్‌వి కాదూ?"

"అవునండి. సాక్షాత్తూ మార్టిన్ రాట్లర్‌నే."

జాలీబోయ్ హఠాత్తుగా మార్టిన్‌ను కావిలించుకున్నాడు. ఎంతకీ విడిచిపెట్టలేదు. ఆనందంతో ఆ వృద్ధుడు తన కార్యాలయమంతా తొక్కేసి, నాట్యంచేసి, నానాహంగామా చేశాడు. ఇలా జరుగుతుందని బార్నీ ముందే ఊహించిఉన్నప్పటికీ అతడు కూడా సంతోషం పట్టలేక వారిద్దరివెంటా పడి నాట్యంచేసేశాడు. పది నిమిషాలకుగాని వారి ఆనందం తగ్గి స్థిమితపడలేదు.

మార్టిన్ మొదటగా అడిగిన ప్రశ్న "మా పెద్దమ్మ డరోతీ గ్రంబిట్ ఎక్కడుంది?" అని.

జాలీబోయ్ మాట్లాడలేదు. కుర్చీలో కూర్చుని చేతులతో ముఖం కప్పుకున్నాడు.

మార్టిన్ ఆదుర్దాగా "ఏం జబ్బుగా ఉందా?" అని ప్రశ్నించాడు.

"లేదు. కాని......"

"ఏమైంది? చచ్చిపోయిందా?" అని రుద్ధకంఠంతో అడిగాడు మార్టిన్.

"లేదు, చచ్చిపోలేదు. అసలు మీ పెద్దమ్మ ఏమైందో, ఎక్కడుందో తెలియలేదు. ఏడాదినించీ కనిపించడంలేదు" అన్నాడు జాలీబోయ్.

ఆమె చనిపోలేదనేవార్త విని మార్టిన్ కొంత శమించాడు. ఎక్కడో ఇంకా బతికేఉంటుందని ఆశ కలిగింది. "ఎప్పుడు వెళ్లిపోయిం దసలు? ఎందుకు వెళ్ళింది? ఎక్కడికి వెళ్లింది?" అని గబగబ అడిగాడు.

"నువ్వు మాయమైపోయి, ఎన్నాళ్ళకు తిరిగి రాకపోయేసరికి, ఆమెకు అదివరకటి ఉత్సాహం, ఆశ

ఉడిగిపోయాయి. ఏమీ చేసేదికాదు. కిటికీలో కూర్చుని అస్తమానం సముద్రంకేసి చూస్తుండేది. ఆమెకు తోడుగా ఉండడానికి ఒక పిల్లను కుదిర్చాను. ఉన్నట్టుండి ఒకరోజున ఆమె తన బట్టలూ అవీ మూటకట్టుకుని, ఎవరితోనూ చెప్పకుండా లివర్‌పూల్ వెళ్లే బండి ఎక్కిందట. మార్టిన్‌ను వెదకడానికే తాను వెడుతున్నానని ఎవరితోనో చెప్పిందట. వెంటనే నేను కూడా లివర్‌పూల్ వెళ్లి వాకబు చేశాను. ఆమె జాడా, ఆనవాలూ కానరాలేదు. అప్పటినుంచీ, నేను ప్రయత్నలోపం లేకుండా ఆమెకోసం వెదుకుతూనే ఉన్నాను," అని ముగించాడు జాలీబోయ్.

మార్టిన్ కాసేపు శూన్యంగా చూస్తూ ఉండిపోయాడు. గభాలున లేచి జాలీబోయ్ చెయ్యి పట్టుకుని "వస్తానండి. వెంటనే లివర్‌పూల్ వెళ్లాలి. మళ్ళీ కలుద్దాం," అన్నాడు.

"ఆగు, మార్టిన్" అని ఆయన వారిస్తున్నా వినకుండా మార్టిన్ త్వరితంగా గది విడిచి బయలుదేరాడు. బార్నీ అతన్ని అనుసరించాడు.

## 24

రోజులు, వారాలు నెలలు గడిచాయి. లివర్‌పూల్ పట్టణంలో మార్టిన్ తన పెద్దమ్మకోసం తెగ వెదికాడు. ఎక్కడా ఆమె ఆచూకీ దొరకలేదు.

ఒకరోజున మార్టిన్ తన బసలో కూర్చుని ఉండగా ఒక పోలీసువాడు అతనికోసం వచ్చాడు. పెద్దమ్మకోసం వాకబుచెయ్యడంలో అతనికి పోలీసువాళ్ళనేకులు పరిచితులయ్యారు.

"మీరు చెప్పిన లక్షణాలు గల వృద్ధురాలొకామె మాకు కనిపించిందండీ" అన్నాడు పోలీసువాడు.

"నిజంగా?"అని మార్టిన్ ఆదుర్దాగా అడిగాడు.

"నావెంట రండి" అని పోలీసువాడు మార్టిన్‌ను సందులు గొందులు చాలా తిప్పి తిప్పి, బాగా బీదవాళ్లు నివసించే ప్రాంతానికి తీసుకొచ్చాడు. ఒక ఇంటివద్ద ఆగి తలుపు తోసి లోనికి ప్రవేశించాడు. మెట్లెక్కి పైఅంతస్తులో ఉన్న ఒక గదిదగ్గిరికి వెళ్లారు. తలుపు తీసి పోలీసువాడు "అదుగో, ఆమెను చూడండి" అని చూపించాడు.

ఒక కుక్కిమంచంమీద ఒక వృద్ధురాలు పడుకొనిఉంది. చిరుగుల దుప్పటిలోంచి బాగా కృశించి, శుష్కించిపోయిన ఆమె శరీరం కనబడుతోంది. ఊపిరాడుతోందో లేదో కూడా అనుమానంగా ఉంది. దుప్పటి తొలగించి చూడగానే మార్టిన్‌కు ఆమె తన పెద్దమ్మేనని తెలిసిపోయింది. పోలీసువాడికి ఒక పౌను చేతులో పెట్టి వాణ్ణి పంపించేశాడు.

మంచంమీద కూర్చుని పెద్దమ్మ చేతిని చేతులోకి తీసుకుని నిమిరాడు. ఆమెకు మెలకువ వచ్చింది. తన్ను హఠాత్తుగా చూస్తే ఆమె ఉక్కిరిబిక్కిరవుతుందేమోనని భయపడి ముఖాన్ని వెనక్కి తిప్పుకున్నాడు.

"ఎవరబ్బాయ్ నువ్వు? ఇందాక వచ్చిన మిషనరీవా? కాస్త మళ్ళీ ఏసుప్రభువునుగూర్చి చదువు నాయనా! నీకు పుణ్యం ఉంటుంది," అని మళ్ళీ కళ్ళు మూసింది. తిరిగి తెరుకుని"ఇందాక మార్టిన్ వచ్చాడు. మార్టిన్ ఎప్పుడూ నా కలల్లోకి వస్తాడు. కాని కాస్త రొట్టెముక్కయినా తీసుకురాడు. నా కెవ్వరూ తిండి తీసుకురా రేం? నాకు ఆకలిగా ఉండదూ?" అంది.

"నేను తీసుకురానా?" అన్నాడు మార్టిన్.

"తీసుకురా నాయనా! నేను ఆకలితో చస్తున్నాను."

మార్టిన్ వెంటనే బయటికి వెళ్ళి ఆహారం తీసుకువచ్చాడు. ఎన్నిరోజుల్నించీ పస్తుపడుతుందో పరోతీ [illegible] ఆబగా తిన్నది. తరవాత ఆయాసంతో పడి నిద్రపోయింది. ఒక గంట తరవాత లేచి మళ్ళీ కాస్త తిన్నది. ఇంతలో తలుపు తెరుచుకుని ఒక యువకుడు వచ్చాడు. తను డాక్టరుననీ, తన్ను పోలీసు వాడొకడు పంపించాడనీ చెప్పాడు. వృద్ధురాల్ని పరీక్షించి "లాభంలేదు, బతక"దని పెదవి విరిచాడు.

"డాక్టర్! ఎంత డబ్బు కావల్సినా ఇస్తాను. నా పెద్దమ్మను బతికించండి" అని మార్టిన్ వేడుకున్నాడు.

డాక్టరు తల అడ్డంగా తిప్పి "లాభంలేదు. కొంచెం ద్రాక్షరసం ఇవ్వండి. కాసేపు సత్తువ వస్తుంది. అంతకన్న చేసేదేమీ లేదు," అన్నాడు.

మార్టిన్ డాక్టరుకు డబ్బిచ్చాడు. మరికొన్ని నిమిషాల్లో ఒక కుర్రాడు ద్రాక్షపానీయం సీసా తీసుకొచ్చి మార్టిన్ చేతి కిచ్చాడు.

ఆ పానీయం తాగగానే పెద్దమ్మకు కాస్త బలం చేకూరింది. కళ్లలోకి కాంతి వచ్చింది.

"ఎవరు నాయనా నువ్వు? నామీద నీ కింత దయ?" అని మార్టిన్‌ను పరిశీలనగా చూడసాగింది. కాని అతడు నీడలో కూర్చోడంచేత ముఖం కనిపించడం లేదు.

"మీ అబ్బాయి నాకు తెలిసినవాడేనండి. ఈమధ్య నాకు కనిపించాడు కూడాను."

"మా అబ్బాయి మార్టిన్ చచ్చిపోలేదా?" అన్నది ఆమె.

"లేదమ్మా. బతికే ఉన్నాడు."

"ఆ" అని డరోతీ గ్రంబిట్ నిర్ఘాంతపడినట్టు కొంతసేపు మౌనంగా ఉంది. తరవాత అతని చెయ్యి పట్టుకుని "నువ్వు కొంచెం వెలుగులోకి రా, నాయనా!" అంది.

మార్టిన్ వెలుగులోకి వచ్చాడు. "నేనేనమ్మా మార్టిన్‌ని" అన్నాడు.

మార్టిన్‌ను కౌగలించుకున్న దామె. మార్టిన్‌కి దుఃఖం ఆగలేదు.

"వచ్చావా నాయనా! నువ్వు ఎప్పుడూ కలల్లోనే కనిపిస్తావు? ఈసారి కూడా కలలోనే కనిపించావా?" అన్నది పెద్దమ్మ.

"ఇది కలకాదు పెద్దమ్మా! నిజమే" అన్నాడు మార్టిన్.

"అవును కల కాదు. నిజమే. ఇదివరకు నువ్వు కలల్లో నవ్వుతూ ఉండేవాడివి. ఇప్పుడు ఏడుస్తున్నావు. ఇది నిజమే..."అంటూ ఆమె మెల్లిగా నిద్రపోయింది.

## 25

మిసెస్ డరోతీ గ్రంబిట్ చనిపోలేదు. మార్టిన్ పునరాగమనంతో ఆమె జబ్బు నయమై పునర్జన్మ ఎత్తినట్లయింది. ఆమె తిరిగి ఆరోగ్యవంతురాలు కావడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఒకరోజున మళ్ళీ ఆమెను ఆష్‌ఫర్డు గ్రామంలో తమ పాతగృహానికి తీసుకొచ్చాడు మార్టిన్.

జాలీబోయ్‌గారు మార్టిన్‌ను తమ పెద్ద గుమాస్తాగా నియమించుకున్నారు. దానితో తృప్తి కలగక తమ వ్యాపారంలో వాటా కూడా ఇచ్చారు. బార్నీకి కూడా ఉద్యోగం ఇచ్చి తమవద్దనే ఉంచుకున్నారు.

## సమస్యలతో రణం

### (గతవారం సమస్యకు జవాబు)

వీశె బెల్లం ఖరీదు 0-8-0. ఎలాగంటే, జాణకి కావలసిన బెల్లం 3 వీశెలు. దాని ఖరీదు 1-8-0.

నూకయ్యశెట్టి తూచినది $3\frac{1}{2}$ వీశెలు, దాని ఖరీదు 1-12-0.

కాబట్టి మరో పావలా యిచ్చి ఏకముక్క ($3\frac{1}{2}$ వీశెలూ) పట్టుకుపొమ్మంటే తప్పు లేదుగా! కాని జాణ అలా ఊరుకోలేదు. అందులో 0-10-0 తీసుకుంది. ఎందులో? తను 3 వీశెల బెల్లానికీ ఇచ్చిన 1-8-0 లో. అంటే 0-14-0 ఉంచింది. ఆ ముక్కలో సగం ($3\frac{1}{2}$ వీశెలలో) $1\frac{3}{4}$ వీశెల ఖరీదూ 0-14-0 సరిపోయిందికదూ మరి!

కొంతకాలం తరవాత వీరందరూ జాలీబోయ్‌గారి భవనంలోనే ఆయన బలవంతంమీద మకాం పెట్టారు. వృద్ధాప్యంలో మిసెస్ గ్రంబిట్ జీవితం ఏ చీకూ చింతా లేకుండా గడిచిపోయింది. మార్టిన్ రాట్లర్ చేతుల్లో వ్యాపారం బాగా అభివృద్ధి పొందింది. జాలీబోయ్ వలెనే అతడుకూడా ధర్మపరుడై, బీదవారికి సహాయంచేస్తూ, అందరిచేతా మంచివా డనిపించుకున్నాడు.

ప్రతిరోజూ పనులన్నీ ముగిసిన తరువాత జాలీబోయ్, మార్టిన్, బార్నీ, పెద్దమ్మ—వీరంతా ఒకచోట కూర్చుని కబుర్లు చెప్పుకునేవారు. మార్టిన్ తన దూరదేశపు అనుభవాలను వివరించి చెప్పేవాడు. బార్నీ కూడా మధ్యమధ్య వర్ణనలు కలిపేవాడు. వీరిరువురూ మాట్లాడుతూఉంటే ఎన్ని గంటలైనా కూర్చుని ముసలివాళ్లిద్దరూ ఆసక్తిగా వినేవారు. బ్రెజిలియన్ అరణ్యాలను, అక్కడి ప్రకృతి వింతలను వర్ణించి చెబుతుంటే ముసలివారిద్దరూ తాముకూడా ఆ అరణ్యాల్లో, ఆ మృగాల మధ్య ఉన్నట్లే ఊహించుకుని మైమరచిపోయేవారు.

(అయిపోయింది)

# దేనికీ లేని తొండం ఏనుగకు ఎందుకు?

ఆని జంతువుల సభలో ఒక రోజున వాదం జరిగింది. మరే ఎందుకు? అంది లేడి అమాయకంగా. కోను ఎందుకు? అంది జిరాఫీ వయ్యారంగా మెడ తిప్పుకుంటూ. అలా అంటూనే ఆవు మెడ కాస్త వంచి, లేత పచ్చి గడ్డిపరకలు నాలుగు కొరికింది. జిరాఫీ మెడ పైకి సారించి చిటారుకొమ్మనవున్న లేత రెమ్మలు నాలుగు తుంచి భుజించింది. ఏనుగు కదలకుండా మెదలకుండా, తొండంతో నేలమీది గడ్డి పరకలు నాలుగూ, చెట్టు మీది చిగురుటాకులు నాలుగు అందకుని ఆరగించింది. "ఇదుగో ఇందుకే నాకు తొండం" అంది.

నిజమే ఆవూ, లేడీ, మేకా ఆకలేస్తే మెడ వంచి నేలమీద గడ్డిని అందుకు తినగలవు. జిరాఫీ, ఒకాపీ వంటి జంతువులకు చాలా పొడుగైన మెడలు కాబట్టి, ఎంత ఎత్తు చెట్టేనా సరే బాగా మెడ జాపి చిటారు కొమ్మను ఉండే మిఠాయి పొట్లాల వంటి లేత రెమ్మల్ని కోసుకు తింటాయి. ఏనుగకి అసలు మెడే కాలే - అంత పొట్టి అన్నమాట. దానికి నేలమీద గడ్డీ అందదు, చెట్టుమీద రెమ్మా అందదు. అందుకని ఆయాసపడకుండా అదీ ఇదీ కూడా అందకోవడానికే తొండం ఉంది. మెడ అంత కురచ ఎందుకూ, ఒక్కరవ్వ పొడుగ్గా ఉంటే ప్రమాదం ఏముంది? అంటే, చాలా ఉందని చెప్పాలి. ఏనుగు కుంభస్థలంతో చాలా పనులు చెయ్యాలి. ఏనుగు గున్నలకి ఒక చెట్టుమీద లేత రెమ్మలు తినాలని బుద్ధిపుడుతుంది. అవేమో అందవు. అప్పుడు తల్లి ఏనుగ తలకాయతో ఎంత పెద్ద చెట్టునయినా సరే నెట్టి నెట్టి నేలను పడత్రోస్తుంది. మెడ పొడుగ్గా ఉంటే, ఇలా త్రోసినపుడు, చెట్టు కూలడం మాట ఎలా ఉన్నా మెడ విరిగే ప్రమాదం ఉంటుంది



## ఏనుగుకి తొండం ఎందుకు?

ఏనుగు పాఠం చెబుతున్న మేస్టారు, పిల్లలికి హుషారు కలిగించడానికి ఏనుగు-దర్జీ కథ కూడా చెప్పారు. కథలో దర్జీ, సూదితో ఏనుగు తొండం మీద పొడుస్తాడు. అపుడు ఏనుగకి కోపం వచ్చి, చెరువుకెళ్ళి తొండంనిండా బురదనీళ్లు పీల్చి, మళ్ళీ దర్జీ కొట్టుమీదకొచ్చి కొట్టునిండా ఆ నీరు చిమ్ముతుంది.

అబ్బాయ్. ఏనుగుకి తొండం ఎందుకు? అని మేస్టారు అడిగారు.

"దర్జీ వాడికొట్టుమీద నీరు చిమ్మడానికండి" అని శిష్యుడు బదులు చెప్పాడు.

"అది కాదు బాబూ. దానికి తొండంవల్ల ఉపయోగం ఏమిటో చెప్పు." అన్నారు గురువుగారు ఆశగా.

"పెద్ద పెద్ద దూలాలు మొయ్యడానికి, మావటివాణ్ణి ఎత్తి నెత్తిమీద కూర్చోపెట్టుకోవడానికీ నండి."

ఇక ఈ తొండంతో నీళ్ళు తాగుతుంది. చిమ్మనగ్రోవిలాగా, నిండా నీరు పీల్చి, చిమ్ముతుంది. దానికి అదే చెయ్యి. అదే ముక్కు. ఆత్మరక్షణకి అదే ఆయుధం. అది లేకపోతే కథే లేదు.



Printed and Published for Nageswara Rao Estates Ltd., by S Radha Ktishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S Sambhu Prasad.

